# ప ది వే ల రూ పా య లు

## కథానికల సంపుటి

శ్రీ వ్యాస సాహిత్యసమితి, బెజవాడ.

మూ డ ణా లు

# కథానికల సూచన

# ఏమంటారు?

—సిరాఖర్చు, కాగితాలఖర్చు, పోస్టేజి పెట్టుకొని, పేపరులకు - రచయితలు కథానికలను పంపుతున్నపుడు, సంపాదక మహాశయుల వల్ల, రచయితల పరిశ్రమకు-ప్రతిఫలం, శూన్యంగా వుంటున్న యీరోజుల్లో......

—ఒకవేళ ఏమయినా యిచ్చినా? - అది ముష్టిరూపకం గానే! - కాబట్టి, మా 'సమితి' నుండి - వెలువడే యే రచనన్నా యిలా పుస్తక రూపేణ ప్రచురణ చేయాలనే తలంపుతో, మా ఆశయాన్ని యీ విధంగా వెలువరించాం.

—కాగితాలధర పెరిగినా, - సారస్వతం పై వుండే ప్రేమ కొద్దీ - తెనుగు సారస్వతం బాగా అభివృద్ధి కావాలని, తక్కువ వెలలకే - మా 'సమితి' నుండి - వెలువడే - రచనలను ఆంధ్ర లోకానికి సమర్పించ దలచుకొన్నాం.

—కథలలోని పాత్రలు, విరుద్ధంగా కనుబడి - కథలో టెంపో లేక - కుంటుగా నడుస్తున్నట్లు తోస్తే - నిర్భయంగా (మొగమాటం లేకుండా) విమర్శిస్తే మంచిది.

—సారస్వతాభిలాషులూ, పాఠకులూ మా ఆశయాల్ని అభివృద్ధి పరుస్తారని ఆశిస్తున్నాం.

వ్యవస్థాపకుడు,
మోతుకూరు వేంకటేశ్వర్లు.

సినిమా — స్టేజీలకు

సంబంధించిన

— కథలు

కావలెనా! — ప్రొడ్యూసర్లు — స్క్రిప్టు రైటర్లు

మాకు వ్రాయండి!

— మానేజరు:

# శ్రీ వాణీ సారస్వతసమితి

బెజవాడ.

శ్రీ శారదా ముద్రాక్షరశాల, బెజవాడ — అక్టోబరు 1940 — 1,000.

# పదివేల రూపాయలు

అప్పుడు అయిదయింది. శీతాకాలపురోజులు కావడం వల్ల- లోకబాంధవు డపరాంబుధిం గ్రుంకుచున్నాడు. యీజీ చైరులో కూర్చుని యీవెనింగుపేపరు చూస్తున్న నేను, గడియారంవంక చూడగనే, అయి దయిందని తెలుసుకొని ఆపేప రక్కడపారేసి- 'కృష్ణన్' నాకోసం అయిదున్నరకు యెదురు చూస్తుంటాడని దుస్తులేసుకొని దారినిపడ్డా.

అలా నిదానంగా నడిచివెళ్తున్నా! ఆరోడ్డు నామిత్రుడు కృష్ణన్ యింటికి మనం చెప్పకుండానే తీసుకెళ్తుంది. దారిని వెళ్తోంటే నా బుర్రలో అంతులేని ఆలోచనలు తట్టాయి కృష్ణని గురించి - అతని పరిస్థితుల్ని గురించి. అతడు సంవత్సరం క్రిందనే, ఐ. సి. యస్. ఆఫీసరుపనినుంచి రిటైర్ అయి ఆరుమాసాల క్రింద మాషారుగున కాపుర ముంటున్నాడు. వాళ్లింట్లో యెప్పుడూ 'బ్రిడ్జి పార్టీ'లు జరుగుతుంటాయి. ప్రతి 'పార్టీ' రోజున నన్నాహ్వానించేవాడు. అతడు మిత్రులంటే ప్రాణం విడుస్తూ అందరిలో కలసిపోయేవాడు- అధికారగర్వంలేకుండా! అసలు యివ్వాళ వారింట్లో ఒక 'బ్రిడ్జిపార్టీ'వుంది. అందుకే నేను వెల్టం.

అది వాళ్ల ప్రిహారీతో వున్న దొడ్డి. నేను నిరభ్యంతరంగా ప్రవేశించా, దొడ్లోకి! ప్రవేశించానేగాని,-కాళ్లు నడకను మంద గించుతున్నై!

ఆ Compound లో ఒహావిడ ముఖద్వారం వైపొస్తోంది. చాలా త్వరగా నడుస్తోంది, ఆవిడ! వస్తోంటే—ఆమె చేష్టల్ని కనిపెట్టాలని బుద్ధి పుట్టింది.

చూచి చూచి నే గ్రహించిం దేమిటంటే-ఆవిడ నన్ను చూచి సిగ్గువలననో, యేమో-గానీ, దాగుకొంటానికి ప్రయత్ని స్తున్నట్టు నేను గ్రహించా!

ఆవిడ యేదో వుద్దేశాన్ని ఆపుకోలేక, అది నేను చూస్తా నేమో నని తన చీరచెరగు ముఖాని కడ్డుపెట్టింది, ఆ "మెమో షన్" ని నేను చూడ్డానికి వీలులేకుండా! ఇలా ఆమెను చూస్తుండగనే - అభ్యాగతులు నామిత్రు లిరువురు కూర్చున్న 'బ్రిడ్జిపార్టీ' టేబిలుదగ్గరకు వరండాలోకే, చేరుకున్నా!

అలా కూర్చున్నానో లేదో;—నా మిత్రద్వయంలో ఒక డిలా అడిగాడు—

"యేమోయ్! ఒహ విషయం ని న్నడుగుతున్నా—నీ వుద్దేశాన్ని తెల్పాలి?" అంటే, నేను సరే నన్నా!

"మన 'కృష్ణన్' వితంతుసేవాసదనానికి 'పదివేలరూపా యలు' ఘండును క్రింద యిస్తున్నాట్ట, నీవు నమ్ముతావా!" అని ముఖంలోకి చూస్తూ అన్నాడు. నా కాశ్చర్యమయింది.

యేమిటబ్బా! 'పదివేల రూపాయలే!' అబ్బో! యెంత మొత్తం అని అనుకున్నా. రాగా రాగా నాకు ఆవిషయాన్ని గురించి అమితానందం అయింది! నామిత్రుడిలా యింత ద్రవ్యాన్ని సాయం చేయడంవల్ల - మన వితంతు సోదరీమణు లెందరిజీవితములో ఉచ్ఛస్థితి ననుభవించుతాయిగదా అనుకొని- వాళ్ల వుద్దేశాన్ని తెలుసుకోవాలన్న తలంపుతో - వుద్రేకాన్ని ఆపుకోలేక, యిలా అన్నా, వాళ్లందరితో.—

"పదివేలరూపాయలే" అని. మళ్లీ "మీారేమీా దగా పడలేదుగదా? - లేకపోతే మీా కేం మతిపోలేదుగదా?" అని అన్నా, వెంటవెంటనే.

ఇంతలో కృష్ణన్ అక్కడకు వచ్చి కూర్చుంటూ - మామాటలన్నీ విన్నాడు లాగుంది. యిలా అన్నాడు.

'నా అభిప్రాయం వేరు. నే చేసేదానికి- మీా రనుకొనేదానికి భూమ్యాకాశాల కున్నంత దూరం వుంది. అసలు నే నలా చేయడానికి కారణం వుంది. వింటే, మీా రలా ఆశ్చర్యాన్నొందరు. అదొక కథలా వుంటుంది. అది ప్రత్యేకించి యేర్పడ్డది, చాలా ప్రియతమమైంది, రహస్యమైంది కూడాను. మీారు బహిరంగపరచ మనీ యిక్కడ వున్న మీాముగ్గురకూ - నాకూ తప్ప యింకో చెవిని పడవేయమనీ — వాగ్దానపూర్వకంగా చెపితే నేను మీాసందియం తీరుస్తా" అన్నాడు.

ఆ అనిన మాటలందరితోనూ చెప్పినట్లు నటించి - ఆఖరికి ఆవాగ్దానం నన్ను కోరినట్టు తేల్చాడు, నా కామ్రేడ్ 'కృష్ణన్.'

సరేననుకొని వాగ్దానంచేశా! ఇంకోవిషయం కోరాడు. ఆవిషయ మేమిటంటే - తన అసలుపేరునుకూడా రహస్యంగా వుంచవలసిం దన్నాడు.

సరేనని, వప్పుకొన్నాం.

అందరి వాగ్దానానంతరం కాంమ్రేడ్ కృష్ణన్ యిలా మొదలుపెట్టాడు-

"నా వుద్యోగప్రవేశానికి ముందుసంగతి- నాకు వివాహం జరిగింది. భార్యను నావెంటతీసుకుని వెళ్ళకుండా- యిగ్లండు చదువుకోసం వెళ్ళా! వెళ్ళిన పదిసంవత్సరాలకు తిరిగి వచ్చా, మా యింటికి! ఏ ముంది? నా ప్రేమమయమయిన నాభార్య- అత్యానురాగంతో వుండే నాభార్య - యీ ప్రపంచంలో జరిగే మోసాలు, బాల్యవివాహ నష్టాలు, సంఘదురాచారాలు చూచి, భరించలేక— నావియోగాన్ని సహించలేక— ప్రేమకు తావీ ప్రపంచములో లేదని తన ప్రాణవాయువుల నీ ప్రాపంచిక మందలి అనంతవాయువులతో కలిపి ప్రేమ సామ్రాజ్యమందు నాకోసం యెదురు చూస్తోంది! యిహ చెప్పే దేముంది? అందరిలా కొంతకాలంవరకూ నిరంతరసంతాపదావానలంలో మగ్గిపోయా!

నేను వచ్చిన కొన్నిరోజులకు- ఒహరోజున- మాయింటి పొరుగునే వున్న ఐ. సి. యస్. ఆఫీసరుగారింట్లో వివాహంకున న్నాయన యెంతో ఆదరంగానూ, బలవంతంగానూ ఆహ్వానించాడు.

ఆ ఆహ్వానా న్నందుకుని స్నేహితుడుగదా యెందుకు అతన్ని చిన్న పుచ్చాలి అని, యింగ్లండు వెళ్లివచ్చినా నాలో మార్పు కలుగలేదని తెలపటాని కని హాజరు కావటానికి నిశ్చ యించుకున్నా !

బాల్యవివాహాలంటే - సుతరామూ నా కిష్టంలేదు. పూర్వ పద్ధతులూ, ఆమునలిమూక, సంఘనియమాలు, అన్నింటితో కూడిన ఆ పెండ్లి చూడ్డానికి నా కానందంగాలేదు. రాగాపోగా ఆపెండ్లికూతురుకి 10 సంవత్సరాలు. పెండ్లికొడుక్కి 16 సంవత్స రాలు. వయస్సు తెలుసుకున్నా !

వివాహం అతివైభవంగా జరుగుతూంది. ఎక్కడ చూచినా - కోలాహలధ్వనులే ! ఒక పుట్టను అధాటున పగల కొట్టే కనుబడే చీమల్లా వున్నారు, మనుష్యులు. మేళతాళాలు చెవులు గింగురుమనేటట్లు వాయింపబడ్తున్నాయి. పురోహి తుడు మంచినీళ్లు త్రావినట్లు మంత్రవర్షం కురిపిస్తున్నాడు.

నా ఆకారం - అంటే బొట్టూ, కట్టూయివన్నీ నీటివొడ్డున పడ్డ చేపలా వుంది ! నేను, నా చుట్టుప్రక్కలనున్న మనుష్యు లను చూస్తుంటే - మనస్సు కేదో బాధగావుంది. నేను పురో హితుడి దగ్గర కూర్చున్నా !

అతను నాతో మాట్లాడాలి - నన్ను తనధోరణిలోకి దించాలి - అని నా మార్గాన్ని మార్చాలని చూస్తున్నాడు. ఆ వధువుకు పెట్టిన నగలు, వరుని కిచ్చిన కట్నం,

యిలాంటి సంగతు లెన్నో మాట్లాడాడు, నాతో; సాయం త్రం విందుసమయంవరకూ, పెద్ద వ్యవహార పరిష్కారం నిమి త్తం కూర్చునట్లు వింటూ కూచున్నా.

అదివరకు నాకున్నటువంటి విసుగు యెటుపోయిందో మరి! మే మిలానే సంఘ, మత సంస్కరణలు వగైరాలు మాట్లాడుతూ - పరాకుచేత నా వుద్దేశ్యానుసారంగా బాల్య వివాహాలయందు నాకుండే అయిష్టత - అసహ్యాత తెలిపేవరకు - నా మొహంకేసి తీవ్రదృక్కులు ప్రసరింపజేశాడు పురోహితుడు. తమస్థితి నెరిగేవరకూ బాలికలకు వివాహం చేయగూడదని నా వుద్దేశ్యాన్ని వెలిబుచ్చా!

నిజానికి ఆలోచించి చూడండి! యెంతమంది భారత సోదరీమణులు తమజీవితాన్ని గంగపాలు చేస్తేట్లు - మన సంఘ సంస్కర్తలు చేస్తున్నారో! అని అంటూ - వితంతు వివా హాలపై నా కుండే యిష్టతను తెల్పి, అలావుండటంవల్ల చాలా మంచి దని చెపితే, ఆ పురోహితుడు అమితమయిన కోపాన్ని పొంది యిలా అన్నాడు.

"ఇదంతా, మాలముక్కలుచేసిన పనిరా, నాయనా"- అని నన్ను ప్రతిఘటించడంకు పూనుకున్నాడు. కాని మాకు ఆ శుభసమయంలో పెద్దఘర్షణ జరక్క ఆగిపోయాం!

ఇహ నాదృష్టి అచట గుంపులుగా కూచోనియున్న యువతులమీదికీ - పెండ్లికూతురి చుట్టూ కేరింతలు కొట్టూ,

ఆమెను వెకసక్కాలాడుతూ సిగ్గును గలిగించే యవ్వనవతుల మీదికి - వెళ్లింది.

అందరూ, మోయలేనన్ని నగలు,-క్రొత్త క్రొత్త ప్యాష న్లలో తయారైనవాటిని, - రత్నఖచితమయిన నగలను ధరించి తమ సౌందర్యమును వ్యక్తపరుస్తున్నారు. ఆ సౌందర్యదృశ్యము మనోహరంగా వుంది. అంతమంది యువతులలో - చారవజే సికొని దూరి - యెవరికోసమో వెతుక్కుంటున్నాయి, నా కళ్లు. నాదృష్టి వారిమీదనే వుంది. అలా చూస్తుండగా నా కనేక ఆలోచనలు తట్టినై! నేనుకూడా మళ్లీ ఒక బ్రాహ్మ ణకన్యను వివాహం మాడాలని అనుకున్నా! ఎలావుంటుందో - యీశ్వరేచ్ఛ!

నాతో బాతాఖానీకొట్టే పురోహితుడు వివాహాల బ్రోకరు. అందుచేత, అతను నాకు ఒక్కొక్కపిల్లను చూపిస్తూ- వారి వారి తలిదండ్రులపేర్లు - స్థితిగతులూ వగైరాలు చెప్పే వాడు.

నా ఊహాలన్నిటిని తెల్సుకున్నాడు కాబట్టి మంచి చెడ్డ ఎరుకపరుస్తూ, కట్నాలుకూడా యిచ్చేట్టుచెప్పాడు. నేను అతని మాటలకు విసుకు - గర్వమూ చెందా! అతన్ని మెచ్చు కున్నా యెందుచేతనో! కానీ, - ప్రశాంతమై, అమందానంద మయిన చూపులతో - నా మొహంకేసి చూస్తున్న దో అమ్మాయి! ఆ అమ్మాయిని చూస్తే నాకు తృప్తిఅయింది.

నాకంటికి నచ్చింది. అందరికంటేకూడా చాలా అందమైంది అని చెపుతోంది నామనస్సు! నామన స్సగాధంలోకి దిగిపోయింది. కదలికలేని ఆమె హృదయము, దృఢమయిన ఆమెఓర్పు ఆమె అందాన్ని వెయ్యిరెట్లధికంగా తేజోవంతమొనర్చినై.

ఆమె అందరిలా - మెడనిండా పాముపూసల్లా - గాడిద బరువు మోయటంలా! సాధారణమయిన ఒకకోక-లేతగులాబి జాకెట్టు తొడిగింది.

అసలు అందం యెలా వస్తుంది! కల్పితంగా వచ్చిన అందం భగవత్ప్రసాదితమైనదాంతో సమాన మౌతుందా?— అసంభవం! సహజ సౌందర్యం ఆమె మొహాన్నుంచి వుట్టి పడుతుంది. ఆ గ్లాసుతెట్టుముందు మిగతా యువతులంతా మిణుగురుపురుగుల్లా కన్పించారు, నాకంటికి. ఈమె సౌందర్యావలంబనలో వున్న నాకు- పురోహితుని బాతాఖానిలో ఉత్సాహం, ఓర్పు కలిగింది.

సందర్భానుసారంగా అక్కడి యువతుల్ని చూపించి వారిసంగతులు అడిగా!

అక్కడే యింతవరకూ నాకన్నవ శిపాయిలు ఖైదీచేసి నమ్మాయి వుంది. మొదటే ఆవిడను గురించి అడిగితే ఏ మను కుంటాడో ముసలాయన అనుకొని, మొదట యిద్దరె ముగ్గురి విషయం అడిగి, మరీ ఆ అమ్మాయి విషయం అడిగా!- అలా నేను అడగ్గానే, అత నిలా అన్నాడు.

"ఓహో! ఆ యమ్మాయా! సరోజ" అంటూ - పెద్దగా అరచి మాటాడ్డం మొదలెట్టాడు. నా కసహ్యాం కలిగింది.

నన్ను మళ్లీ పరామర్శచేస్తూ యిలా అన్నాడు—

"ఆమె - ఒహ బాల్యవితంతువు. ఆమెభర్త పాపం పదవపేటనే మరణించాడు. కాని, పూర్వాచారప్రకారం తల్లీ తండ్రీ ఆమెను పెనుభూతంలాంటి కేశఖండనలేకుండానే - అవి వాహితయైన పసిడిముద్దలాగు పెంచుతూవున్నారు" అని చెప్పాడు.

అంతకంటే యెక్కువ యేమీ తెలపలా!

ఆమెభర్త ఒకకారు ప్రమాదంవల్ల మృత్యువాతబడ్డా డన్న విషయం - వింటానికి నా కెంతో కష్టమనిపించింది. "ఆహా! నూతన పద్ధతులతో తయారైన ఓ వితంతుబాలికా!" అని నిట్టూర్పువిడిచా!

నేను కూర్చున్న చోటునుంచే - ఆమెవేపు చూస్తున్నా! ఎంతచూచినా తనివితీరడంలా! దూరంగావున్న సంపంగిలా వుంది, ఆమె నాకు.

ఆమెమొహంలోవున్న ప్రశాంతత- నిర్మలత్వము - దయ - కళ యివన్నీ చూస్తుంటే, తన్మయుడనై పోయా! ముద్దుల్ని చేసేట్టు యింతచక్కగా సృజించిన భగవంతునికి వందనశత మర్పించా! చూచి చూచి ఆమెణ్ణి నా అర్ధాంగిగా చేసుకోవా లని సంకల్పించుకున్నా!

ఆమెతండ్రి కేశఖండన చేయకుండా - ముద్దులొలుకు ఆమె సౌందర్యమున కేమాత్రం అంతరాయం కల్గించకుండా - వుండటాన్ని చూస్తే - పునర్వివాహాని కంగీకరించేలా కన్పించింది. ఇహ ఆయన్ని కలుసుకుందా మనుకున్నా!

కాని, నా తండ్రి నన్నింగ్లాండు చదువుకి పంపినప్పుడే - బంధుమిత్రకళత్రాదుల కందరికీ వ్యతిరేకమై పోయాడు. ఇప్పుడీ విషయం అతను వింటే, యిం కేమన్నా వుందా? సరే, నాతండ్రిసంగ తిలా - ఆమె తండ్రిసంగ తలా వుంచి, అస లావిడకు నామీద యిష్టముందో లేదో కనుక్కుందామని నిశ్చయం చేసుకున్నా! ఆవిడ నన్ను వివాహం చేసుకుంటానని కిష్టపడితే - తర్వాత తంటాలు తర్వాతే.

ఆవిడతో యీవిషయం తెల్పటాని కెలా కలవాలి? అనే ప్రశ్న బయటకొచ్చింది, నా మనస్సులోంచి. పోనీ యెవరన్నా Lady-Friends వున్నారా అంటే - అలాంటివారూ లేరు నాకు. అథవా ఒహవేళ యింట్లో యెవరన్నా ఆడస్నేహితులుంటేమటుకు యిటువంటి విషయాలు వింటారా? అన్న సందేహం కలిగింది.

ఆఖరుకు 'యేమీ అక్కర్లేకుండా - నేనే నాకు సహాయం' అని నిర్ధారణ చేసుకున్నా.

విందులు వగైరాలు జయప్రదంగా జరుగుతున్నై! ఉదయం యిల్లంతా జనంతో నిండివుంది. ఆసందడిసమయంలో,

నే నొక ప్రేమలేఖ వ్రాశా - "నన్ను వివాహమాడటానికి గనుక నీకు యిష్టమైతే - నా కానందం కలుగ జేసే గులాబి రిబ్బన్ను నీవు తలయం దలంకరించుకొని మర్నాడు కనుపించు" అని వ్రాసి యెలానో కష్టపడి సాయంత్రం లోపుగా ఆవెడచేతిలోనికి వదిలా నా వృత్తరాన్ని సంపూర్ణమైన ఆశతో!

నే నిలా ధైర్యంగా చేసినపని కామె ఆశ్చర్య మొందింది. గాభరా పడ్డదికూడాను! బాగా తేరిపారచూచింది. నాకు గుండెలు పీచుపీచు మన్నాయి. ఏమీ మాటాడకుండా వెళ్లి పోయింది. కొంచెం నామనస్సు కుదుట పడ్డది.

మేళతాళా లమోఘంగా మోగుతున్నై! నా కాదినము యెంతో సుదినం అనుకున్నా! ఉద్రేకం - ఉత్సాహం - ఆత్రత ఆవరించాయి నాకు.

రోజూకంటె పెందలకడవచ్చి,—యెప్పు డొస్తుందా? ఎప్పుడు నేచెప్పిన సిల్కు రిబ్బను చూదునా? యెప్పు డామెను వివాహ మాడుదునా? అని అతురితపడ్డా.

కాలమున కే మహాజాడ్యమో పట్టినట్టు- మందమందంగా నడచినట్టుంది నా బుర్రకి. గుండెలు వేగంగా కొట్టుకొంటూ, తల గిర్రున తిరుగుతూంది.

గుంపులు గుంపులుగా తమ సౌందర్యాన్ని వ్యక్తపరుస్తూ వస్తున్న ఆయువ్వనవతులలో నక్షత్రమండలంలోని చంద్రుడిలా ప్రకాశిస్తూ వచ్చింది నా సరోజం! ఆనంద ముప్పొంగింది.

తన్మయుడనై గబగబా దగ్గరకు వెళ్లా; కాని, నేనుకోరిన 'రోజ్ రిబ్బన్' లే దామెతలలో. నాకు శిరోవేదన, మనఃక్లేశమూ కలిగింది. యెంతసంతసించానో, అంతకు వేయిరెట్లు చింతించా!

ఇహ ఒక్కనిమిషమైనా ఆ వివాహమండపం దుండ బుద్ధి పుట్టక యీ నామందభాగ్య శరీరమును యింటికీడ్చుకొనివచ్చా"- యిది, కథయందలి ప్రథమాంకం అని మిగతా దిలా Begin చేశాడు.

"సంవత్సరం అయింది. నే నొక చక్కని చదువుకొన్న కన్యను వివాహం చేసుకున్నా! కాలం వెళ్లిపోతోంది. ఇవ్వాళ పొద్దున్న ఒక Lady వచ్చి నన్ను పిల్చింది. ఆశ్చర్యంగా దగ్గర సా వెళ్లా! ఆమె చాలా సాధువువలె కనిపించింది. నావైపు తేరిపారచూచి—

"మీరు నన్ను గుర్తించా రనుకొంటా" నంది.

ఆశ్చరంతో "నాకు గుర్తురానందుకు క్షమించ"మన్నా.

అప్పు డామె నాతో యిలా అంది—

"సరే! మీకు జ్ఞాపకం లేకపోతే వినండి—"

"—యే యువతిచేతియందు మీరు ఒకప్పు డొక వృత్తాన్ని జారవిడిచారో.........ఆ యువతిని నేనే! యెప్పు డని విచారించకండి- మీ పొరుగింట జరిగిన వివాహ సందర్భంలో-" అని గుర్తుచేప్పేవరకు-నా కా వివాహం, ఆ పురోహితుడూ, అతని వాదం, ఆ యువతుల సమూహం, ఆ 'రోజురిబ్బన్' విషయం,

ఆ కోర్కె యివన్నీ ఒక్కసారి తలపుకొచ్చి, ఆమె కేమీ సమాధానం చెప్పడానికి నాకు తోచలా!

"మీరు నాకు ఆ వుత్తరాన్ని యిచ్చినారేకాని, నాకు చదువు రాదు. యెలా చదువగలను?—పోనీ, యెవరికయినా చూపించడానికా సిగ్గు - పయిగా యితరులకు తెలుసుందేమో నన్న భయం. వీటితో యిలా అయింది నా పరిస్థితి.

అందువల్ల దాన్ని ఆలానే దాచిపెట్టివుంచా; సిరా అంతా చెరిగిపోయేవరకూ వుంచా - నిరంతరము నా కన్నీళ్లతో ఆ సిరా అంతా చెరిగిపోయేది.

అప్పుడు చదువుట - వ్రాయుట నేర్చుకోవాలని బుద్ధిపుట్టి చదువునేర్చుకొని కృతార్థనయ్యా! చదువుకోసం నాతండ్రిని వేధించా - నాకు చదువు చెప్పించేవరకు విసిగించా. కొంత కాలానికి 'మద్రాసు యూనివర్సిటీ' లో డిగ్రీ సంపాదించగలిగా!

అప్పటినుంచి ఆ ప్రాంతాలలో వుండే యువతులకు విద్యాభ్యాస ప్రబోధానికి ప్రయత్నిస్తున్నా. నేను సేవాసదనంలో పనిచేస్తున్నా!

అందులో ఉన్నతపాఠశాల, భోజనవసతిగృహంకూడా వున్నై. మేము ఒక సంఘాన్ని యేర్పరచాం. ఆ సంఘో ద్దేశ్యం ప్రపంచములోని యువతులకు విద్యాభ్యాసము చేయించుటయే! బహుశా భగవంతునిదయవల్ల - మరుసటి వత్సరానికే, మా కర్తృత్వం చాలావరకు నెరవేర్చుకోగల మని తలుస్తాను.

సేవాసదనానికి "ఫండ్సు" వసూలుచేసే నిమిత్తం 'టౌనుహాలు' లో సభ జరుప నున్నాము. తమను మా సభకు అధ్యక్షపదవి వహించుటకు పిల్చేందుకు వచ్చా!"

కాబట్టి అందువలన మనకు యీ రోజు 'బ్రిడ్జి పార్టీ' లేదు. రేపు తప్పక అక్కడకు మీరు రావలసింది అని కృష్ణన్ లేచాడు.

మేమూ అతనితో పాటు లేచి వెళ్ళిపోయాము.



# ఆనందం

అందరిలోనూ ఆనందమయమైన జీవితం ఎవరిదంటే ఆనందందే అని చెప్పాలి.

ఆనందం మద్రాస్‌లో చదువుకుంటున్న రోజుల్లో, అతని యింటి ప్రక్క వితంతు కరుణాదేవి కాపురముండేది. తల వని తలంపుగా యిద్దరికీ, గాఢమైన ప్రేమ ఏర్పడింది.

కరుణ వితంతు వైనప్పటికీ సంఘుసంసంస్కారాలకి కట్టు బడకుండా, అందరితోపాటు ఆనందంలో భాగం పంచుకుంది.

తానుకూడా సినిమాలకి, మీటింగుల్లోకి వెళ్తూ సమ యానుకూలంగా స్త్రీ స్వాతంత్ర్యంను గురించి 'లెక్చర్స్' యిస్తుండేది కానీ, ఆమెకి.........కరువైంది పాపం.

కరుణకి ఆనందంతప్ప స్నేహితులు లేరు. ఆమె ఎప్పుడూ బాల్యవివాహాల గురించీ, స్త్రీ స్వాతంత్ర్యాన్ని గురించీ, పత్రికల్లో- వ్యాసాలు అనుభవపూర్వకంగా వ్రాస్తుండేది.

అవును, చిన్నతనంలోనే తల్లితండ్రులు డబ్బుకోసం వృద్ధుడి కిచ్చి- పెళ్లిచేసి- గొంతుకోశారు.

చిన్నతనంలోనే తల్లితండ్రులు కరవయ్యారు. అజ్ఞా నాంధకారంలోంచి బైటపడ్డంతోనే ముసలిభర్త చనిపోయాడు- తల్లితండ్రులతోపాటు.

ఆమె దిక్కులేక యీ ప్రపంచంలో ఏకాకి అయి పోయింది.

భర్త నిర్యాణానంతరం - కరుణ 50 వేల ఆస్తికి అధికారిణి అయింది. అందుకని కరుణ కోమలహృదయాన్ని ఆనందం అపహరించాడు.

కరుణ మొదటిలోనే, తాను వితంతువునని చెప్పి, ఒప్పించి, మరీ ప్రేమించింది- అతన్ని.

అతనుకూడా కరుణయొక్క సౌందర్యానికి ముగ్ధుడై- కరుణచేత కరుణింప బడ్డాడు.

మరి కొన్ని రోజులకె మద్రాసులోనే వివాహం చేసుకున్నారు, యిద్దరున్నూ.

బి. ఏ. పూర్తిచేసి స్వగ్రామంవచ్చి బ్యాంకులో హెడ్ క్లార్కుపని చేస్తున్నాడు, ఆనందం.

కరుణయొక్క ఉదారగుణాన్ని చూచి, ఎవ రెన్నివిధాల చెప్పినా వినక, ఆమెకి సంపూర్ణమైన స్వతంత్రం యిచ్చివేశాడు- ఆనందం.

వాళ్ల సంసారనౌక ఆనందమహాసముద్రంలో ఒడుదుడుకులు లేకుండా ప్రేమతరంగాల్లో కొట్టుకొని పోతోంది.

కరుణ, ఆనందంల ప్రేమ చిహ్నంగా మోహన్ అనే ముద్దుల కొడుకు పుట్టి, వాళ్ల ప్రేమబంధాన్ని బలపర్చాడు.

* * * *

పక్షులు కిలకిలారవ ధ్వనులతో తమకొరకు ఎదురు చూస్తుండే బిడ్డలవద్ద కెళ్లాలనే ఆదుర్దాతో గుంపులు గుంపులుగా వరుసలు దీరి నయనానందకరమైన దృశ్యాన్ని కల్పిస్తూపోతున్నై.

లోకబాంధవుడు పగలంతా కష్టపడి పశ్చిమాంబుధి జేరుతూ, భూమి కంతకూ తన బంగారు కుంకుమ రంగు కిరణాలతో యింద్రకీలాద్రిపై ఆగుతూ చూస్తున్నాడు.

నదీ తరంగాలనుంచి చల్లని పిల్లతెమ్మెరలు మెల్లగా వీస్తూ, తీరమున ప్రకృతిని తిలకిస్తూ కూర్చున్న యువతీ యువకుల నానందమయుల నొనరింపజేస్తుంది- సమీపవనంలోంచి వెలువడుతున్న మలయమారుతం.

అచ్చటి యిసుకతిన్నెలమీద అనేకమంది గుంపులు గుంపులుగా కూర్చున్నారు, ప్రకృతిని తిలకిస్తూ!

నీటివొడ్డున ఆనందం వేణుగోపాలరావుతో కూర్చున్నాడు - ఎవ్వరితోనూ సంబంధంలేనట్టు.

ఆనందం ముఖంలోవున్న విషాదరేఖల్ని గుర్తించి గోపాల్ యిలా అన్నాడు- "ఏరా ఆనంద్! విచారంగా వున్నావేం?"

అతను మాట్లాడలేదు.

"ఏరా! బ్రదర్! ఏం, నాతో చెప్పడానికి యిష్టం లేదు? చూడూ మనం మద్రాస్‌లో వుండగా, ఎంత అన్యో

న్యంగా వుండేవాళ్ళం?" అని వేణు అంటే - అందుకు ఆనందం నిఃట్టూర్పు విడిచాడు.

కోరుకున్న భార్య దొరికింది; ఇంక స్నేహితు లెందుకూ? - అన్నాడు వేణు.

"కోరుకున్న భార్య కాబట్టే కొంపదీసింది" అన్నాడు ఆనంద్, విషాదంగా!

వేణు ఆశ్చర్యపడి ఆనంద్ ముఖంలోకి చూచాడు. అప్పుడతని నేత్రద్వయంలోంచి అశ్రుకణాలు రాలాయి.

ఇక ఆనందాన్ని ఆవిషయం అడిగి అతని మనస్సుకి కష్టం కలిగించడం యిష్టం లేకపోయింది - వేణుకి.

అయినా "ఏమైందీ? అలా విచారిస్తున్నా వెందుకూ?" అన్నాడు ఆదుర్దాగా— అసలు విషయం తెలుసుకోవాలని.

"వేణు! నాతోపాటు నీకూ్కడా......"అబ్బే సందేహించక చెప్పు. చదువుకున్నవాడివి, స్నేహభావ మెటువంటిదో తెలీదూ?- యిలా అనుమానిస్తా వెందుకూ? అన్నాడు వేణు, వాత్సల్యం వుట్టి పడేట్టు.

"..................."

"అసలు విషయం ఏమిటీ?" అన్నాడు, ఆదుర్దాగా తిరిగి వేణు.

వేణు పట్టుదల విడిచేట్టు కనబడకపోవడంవల్ల "యింతగా అడుగుతున్నావు. చెప్పకపోతే బాగుండదు" అని, యిలా చెప్పడం మొదలు పెట్టాడు—

"చెబుతే నువ్వు నమ్ముతావో నమ్మవో కానీ, సువర్ణ ప్రతిమలాంటి ఆకారం, లేతగులాబి పువ్వుల్లాంటి బుగ్గలూ, నల్లత్రాచులా వాలుజడా, తామర రేకుల్లాంటి కళ్లలో ఆమె వీణ చేత్తోపట్టుకొని వాయించుతూ పాటలుపాడుతుంటే, పసిడి నిగ్గులు దేరిన ఆ బుగ్గలమీద తాళంవేస్తూ, అర్ధ చంద్రాకారంలో రత్నాలు పొదిగిన ఆలోలాకులు నాట్యమాడుతూ, కరుణ బుగ్గల్ని ఎర్రగా కందించుతుంటే - ఆ, అర్ధ చంద్రాకారాల మీద నాకు కోపం వచ్చేది. అటువంటి అపరూప సౌందర్యవతియొక్క రూపలావణ్యాలను చూచి, చేసుకున్నాను గానీ - యిలా అర్ధంతరంగా నా గొంతు తడిగుడ్డతో కోసి లేచి పోతుందని అనుకోలే దోయ్!

'అదా సంగతి' అని గోపాల్ గోప్యంగా అనుకుని - 'నేను మొదటినుంచీ చెబుతూనే వున్నానుగా' "చదువుకున్న ఆడదాన్ని చచ్చినా నమ్మకూడదని, ఎప్పటికైనా దగాచేస్తుందనీ. ఇప్పట్లో అమాయకులైన ఆడవాళ్ళే నయం. నవనాగరికతలో నలిగిపోతూ - చదువుకొని - ఫ్యాషన్‌లతో తిరిగేదాన్ని ప్రేమించవద్దనీ, ప్రేమించినా పెళ్లి చేసుకోవద్దనీ." పెళ్ళిచేసుకొని పైగా స్వతంత్రంకూడా యిచ్చావు - మొగరాయుడిలా

తిరగడానికి. స్త్రీ స్వతంత్రం గురించి నేనే ముందంజ వేస్తానని, వేసి - అనుభవించావే!

అవును బ్రదర్! నువ్వన్నట్టే చేసింది. ఆఖరుకి దానివల్ల సంఘంలోంచి బహిష్కరింపబడ్డాను. ఇంక నాకు భార్యలేని లోటు ఎలా తీరుతుంది చెప్పు? గంపంత సంసారం వదలి తల్లి తండ్రుల్ని ఎదిరించి వచ్చేశాను. ఇంక ఏ ముఖంతో వెళ్ళను?

'పెద్దలమాట చద్దిమూట' అనేది మరచి, చిన్నోళ్ళ, పెద్దో చెప్పాడని విన్నావూ? సరే- ఎప్పుడు వెళ్ళింది?- అన్నాడు వేణు'

ఇవాల్టికి అయిదురోజులయింది. వేణూ! యింక నా తనువు ఎలా తెల్లవారుతుంది చెప్పు! 'మూల్గుతున్న నక్క మీద తాటికాయపడ్డట్టు' అది వెళ్ళిందని నేను నానాఅవస్థ పడుతూ, హోటల్లో తింటూంటే - యిదో విచారం...

అ దేమిటీ? అన్నాడు, ఆత్రుతసూచించే ముఖంతో-వేణు.

తాను వెళ్ళేప్పుడు మోహన్ నైనా తీసుకెళ్ళకుండా విడిచి వెళ్ళింది. మూడేళ్ళయినా ముచ్చటగా తీరలేని ఆ బిడ్డ ఏడుస్తుంటే నా గుండెలు గుభేలు మంటున్నై. వాణ్ణి ఓదార్చలేకుండా వున్నానోయ్. దాని హృదయం ఎంతకఠినమైందో చూడు-అన్నాడు, ఆనందం, అయోమయంగా నీటిలోకి చూస్తూ!

ప్రేమే ప్రధానమని పొయ్యేదానికి పిల్లేమిటి, జల్లేమిటి?- ఎవరైనా లెఖ్కలేదు, 'తినమరిగిన కోడి ఇల్లెక్కి కూసిం'దిట!

అలా చేసింది. పాపం, పోనీలే! అయిందానికి విచారించడం ఎందుకూ? అని ఓదార్చాడు-వేణు.

వేణూ! మనసారా ప్రేమించి పెండ్లి చేసుకున్న భార్యే యిలా మోసగించినప్పుడు ఈ సంసారం ఎందుకు? తల్లి కోసం ఏడుస్తున్న ఆ పసివాణ్ని, తల్లి లేని కొరత తీర్చి ఎలా పెంచగలను, చెప్పు?

అని ఆనందరావు అంతులేని దుఃఖంతో, కన్నీరు కారుస్తూ రెండు చేతులతో కళ్లుమూసుకొంటే, అతనికి గణగణ ధ్వనులతో అలారం వినిపించింది. ఆ అలారం ధ్వనిలో ఐక్యమై, "అయిదు న్నర అయింది లెగండి" అంటున్న కరుణ కంఠధ్వని వినిపించింది.

ఆనందం కళ్లు తెరిచాడు. టేబిల్ దగ్గర రెండు కుర్చీలు వున్నాయి. ఒకకుర్చీలో కూర్చుని కరుణ టీ చల్లారుస్తోంది.

ఆనందం ఆదుర్దాగా లేచి "మోహన్ ఏడీ?" అన్నాడు, తలగడదిండుక్రిందనుంచి సిగరెట్టు తీసి ముట్టిస్తూ!

"ఎక్కడికి కెళ్లాడో తెలుసుకోండి, చూద్దాం?" అంది కరుణ- మంచంకిందికి చూస్తూ.

మంచం దిగి ఆనందంకూడా చూచాడు, కిందికి.

మంచం కింద మోహన్ రబ్బరుబొమ్మలతో ఆడు కుంటున్నాడు- కులాసాగా.

లోపలి కెళ్లి డ్రస్సువేసుకొని వచ్చాడు-ఆనందం.

చంటివాణ్ని టేబిల్ మీద కూర్చుండబెట్టింది కరుణ. ముగ్గురూ కలిసి టీ త్రాగారు. బైటినుంచి హారన్ వినిపించగానే, ముగ్గురూ వెళ్లి కారులో కుర్చున్నారు.

"కళామందిరానికి పోనియ్యి" అంది, కరుణ-సాయంత్రం ఆరు అవడంవల్ల, చల్లని పిల్లవాయువులు మెల్లగా వీస్తుంటే, మలయ మారుతం మానవలోకాన్ని మైమరపిస్తుండగా, కారు కళామందిరానికి వెళ్లింది.

బం దు చో డె ల క్ష్మ ణ రా వు

# ప్రతీకారం

"ఇం కేముంది? రాజుగారు యుద్ధంలో దెబ్బలు తగిలి పడిపోయా రట!"

అని ముఖ్యపరిచారికయైన శాంతి చెప్పగానే, గనోరు మహారాణి మొదలు నరికిన మర్రిచెట్టులా నిలువునా కూలి పోయింది.

అంతగాదు - యిం కెంతవస్తేమాత్రం ఏం? రాచబిడ్డ రాచబిడ్డే! అందులోనూ, మహారాష్ట్రవంశాన్ని పుట్టిన వజ్రపు తునక!

గనోరు మహారాణియొక్క సౌందర్యం వర్ణనాతీతం- పసిడినిగ్గులుదేరిన ఆబుగ్గలూ, నిండుయవ్వనంలోవున్న ఆశరీర కాంతీ, నిండుచంద్రుణ్ని ధిక్కరించే ముఖవర్చస్సూ, ఆ రాజ ఠీవి, కల్వరేకుల్లాంటి ఆ నేత్రద్వయం, సొంపయిన ఆచేతులూ- యిం తెందుకు అపరరతీదేవిలా వుంటుంది.

మహారాష్ట్ర సుక్షత్రియవంశంలో పుట్టడంవల్ల ఆమె సౌందర్యం సార్థకమైంది.

గనోరుమహారాణియొక్క పౌరుష ప్రతిభలుకూడా చెప్పు కోతగ్గవే.

అన్నమాటను తప్పని సత్యశీల. తనదేశక్షేమంకోసరం మానభంగం కాకుండా, ఎంతటి అమానుషకృత్యానికైనా వెనుదీయని త్యాగబుద్ధి గల సాహసికురాలు.

ఎంతటి యోధానయోధులనైనా ప్రతిఘటించి, పచ్చి రక్తం త్రాగే పట్టుదలగల రోషంతోవున్న ప్రతిభాశాలిని.

దుఃఖపూరితమైన మనస్సుతో-“శాంతీ!” అంది రాణి.

“అమ్మా! మీరే యిలా అధైర్యపడితే యింక మా గతేమిగాను” అంది, శాంతి - నేత్రద్వయంలోంచి అశ్రుకణాలు రాలుస్తూ.

ఆమాట వినేప్పటికి రాణి తొక్కత్రొక్కిన త్రాచులా లేచి ‘శాంతీ! ఆయుధాలు సిద్ధంచేయి’ అంది, దీర్ఘంగా చూస్తూ—

వెళ్లి, తాను మోయగలిగినన్ని ఆయుధాలు తెచ్చి, రాణి ముందు పెట్టింది, శాంతి హుషారుగా.

“అందరూ సిద్ధంగండి వీరస్వర్గానికి వెళ్ళేందుకు” అని, రాణి లోపలికెళ్లి, యుద్ధపుదుస్తులు ధరించి, తన దాసీసైన్యంతో యుద్ధభూమి కెళ్ళి, భర్తపడిపోయిన స్థలం చేరుకుంది.

అప్పటికి యింకా ప్రాణాలుపోక ప్రాకులాడుతున్న భర్తను చూచి, దుఃఖంతో అతని రొమ్ముమీదికి వాలిపోయింది-రాణి.

“నీవు నన్నుగురించి విచారించడం చాలా పొరపాటు. యవనసైన్యాలు కోటలో ప్రవేశించడానికి సిద్ధంగావున్నై.

వెంటనే వెళ్లి నీ ధీరత్వం ప్రకటించి శత్రువులను ప్రతిఘటించు ” అని భర్తచెబుతుంటే-

ఆమెశరీరంలోని ప్రతినరమూ వేడిరక్తంతో వుబికింది - వుద్రేకపూరితంగా భర్తచేతిలోని కత్తిని తీసికొని “దుర్మార్గుడైన సర్దారును చంపితీరుతా”నని ప్రతిజ్ఞ పట్టింది, రాణి- నేత్ర ద్వయంలోంచి అగ్నికణాలు రాలుస్తూ - భర్తముందు.

“ప్రియా ! వంశానికి కళంకం...రాకుం...డా—కా... పా...డు...కో ” అని, విశ్వప్రపంచంలోంచి విముక్తినొంది వీరస్వర్గాన్ని అలంకరించాడు - మహారాజు.

దాసీజనంతో యవనసైన్యంమీదికి ఆకలిగొన్న సింహం లా పడి తనపౌరుష ప్రతిభలను ప్రకటించింది, మహారాణి.

తురుష్క సైన్యనాయకుడైన సర్దారు ధర్మాధర్మ వివక్షత లేకుండా మహారాణిని ఢీకొన్నాడు.

ఇహ వాళ్లిద్దరి యుద్ధం హద్దుమీరింది. “జగం”కు విలయం సమకూరినట్లు, చెప్పడానికి అలవిగాకుండా రెండు జాములవరకూ పెనగులాడారు.

ఎంతచేస్తే మట్టు కేం ?

విధి ప్రతికూలం అవడంవల్ల మహారాణి యుద్ధభూమి వదలి, దాసీజనంతో సహా పారిపోయి, తనవినోదంకోసంకట్టిన యమునానది వొడ్డున వున్న మహాలులో కెళ్లి దాక్కొంది.

ప్రయాణ బడలికచేత కాబోలు! వృద్ధభానుడు నెమ్మదిగా పడమటిసముద్రంలోకి తనరక్తవర్ణ కిరణాలతో యుద్ధభూమిని మరింత భయోత్పాతాన్ని గలిగిస్తూ దిగుతూ వుంటాడు.

దూరంనుంచి ఒకగ్రుడ్లగూబ వికృతంగా అరుస్తూ గనోరుకోటబురుజులమీదనుంచి ఎగిరిపోతుంది- విలాసంగా.

*   *   *   *

"చెబుతుంటే నీగ్గాదూ? మర్యాదగా వెళతావా, మెడపట్టి బైటికి గెంటించమంటావా?"

అని, మహారాణీగారి దేవిడీముందు విచ్చుకత్తులలో పహారా చలాయిస్తూవున్న కొందరు ఆడసిపాయిల్లో - ఓ ఆమె అంది - తురుష్కనాయకుడైన సర్దారుదగ్గర్నుంచి రాణీగారికి జాబు తెచ్చిన తురుష్కభటుణ్ని.

నిప్పుత్రొక్కిన కోతిలా మొహం ఎర్రగా చేసుకున్నాడు- అతను.

ఏమిచెయ్యగలడు? ఆయుధపాణులైన ఆ పారావాళ్లని; అందులోనూ, తన యజమాని ఆజ్ఞకూడా లేదాయె.

"అమ్మా! సర్దారుగారి దగ్గర్నుంచి, రాణీగారికి జాబు తెచ్చాను"—అన్నాడు, వినయంగా!

'సరే వుండు' అని లోపలి కెళ్లి, మహారాణీగారి దగ్గరి నుంచి హుకుం తెచ్చింది—అతన్ని వదలడానికి.

ఆ తురకబిడ్డ 'హుహు' అని సకిలించి కోరమీసాలు దువ్వుతూ ఓసారి చురుగ్గా చూచాడు- ఆమెవైపు.

క్రోధావేశంతో గుర్రుమంటూ, వరలోవున్న కత్తిమీదకి చేయిపోనిచ్చింది- ఆమె.

"మహారాణీజీకి సలాం, సలాం!" అంటూ- లోపల కిటికీదగ్గర దీర్ఘంగా ఆలోచిస్తూ పచారుచేస్తున్న రాణీసమీపంలో వెళ్లినుంచున్నాడు- భటుడు.

ఏమి ఆలోచిస్తూవుందో కాని, అతన్ని చూడ్డంతోనే చిరునవ్వుతో వచ్చి ఒక మఖమల్ దిండ్లుపరిచిన సోఫాలో కూర్చొని-

'ఎవరు నువ్వు?' అంది, విలాసంగా— రాణి.

'అమ్మా! సర్దారు దగ్గరినుంచి వచ్చాను' అని జేబులో వున్న జాబును తీసి ఆమె ఎదుటవున్న బల్లమీద పెట్టాడు, వినయంగా.

'సర్దారు దగ్గర్నుంచా?' అని ఆదుర్దాగా దాన్ని తీసికొని 'నీ పేరేమిటి?' అంది, ఆశ్చర్యంగా - అతన్ని చూస్తూ.

'మొహబత్ ఖాన్' అన్నాడు, రాజభక్తి ప్రకటిస్తూ- భటుడు.

'వారు స్వయంగా వ్రాశారా? నామీద ఎంతప్రేమ?- సర్దారుగారికి' అంది, అతనిమీదవున్న మమకారాన్ని వెలిబుచ్చుతూ.

ఆతడు ఆశ్చర్యపోయాడు, రాణి సర్దారును ప్రేమించ డంవల్ల. "జీహా" అన్నాడు - భావాన్ని ప్రకటించకుండా.

'మొహాబత్ ఖాన్ ! అయితే వారు ఎల్లప్పుడూ యిక్కడే వుండిపోతారా ?'

'జీహా ! గనోరును సర్దారుగారిని ఏలుకోవలసిందని వుత్తరువుకూడా వచ్చేసింది, పాదుషాదగ్గరనుంచి.'

తనమనస్సులోవున్న అనుమానం తీరిపోయినందుకు సంతోషాతిరేకంగా - దీర్ఘమైన వేడినిట్టూర్పు విడిచింది, రాణి-లోపలి భావాలను పైకి వెల్లడిగాకుండా !

'రాణీసాబ్ ! సర్దారుగారు...'

'ఔను నేనుకూడా, దీనికోసమే ఎదురు-చూస్తున్నాను.' అని జాబును తనలో తాను చదువుకొని దానికి జవాబు వ్రాసి భటునిచేతికి యిచ్చి-

'ఈ జాబు జాగ్రత్తగా అందజేయాలి సుమా !' అంది అతనితో.

'జో హుకుం' అని, అతను అక్కడినుంచి వెళ్తూ, తన భర్తను చంపిన సర్దారునే తిరిగి రాణి ప్రేమించడం చాలా విచిత్రంగా వుందే ? అని, ఇంకా ఏమి టేమిటో ఆలోచించుకుంటూ వెళ్లిపోయాడు.

మనసు వుండబట్టక, యింకోసారి విప్పిచూచుకొంది, రాణి, వుత్తరాన్ని. ఏమీ తోచలా.

'ఎవరక్కడ' అంది, గుమ్మంవైపు చూస్తూ!

అమ్మా!' అనుకుంటూ, ఒహాపరిచారిక వచ్చి నిలబడింది.

'వెళ్ళి శాంతిని పిలుచుకొనిరా. అంది,' మహారాణి రాజ శీవిని ప్రకటిస్తూ.

శాంతి వచ్చి ఎదుట నిలబడింది, రాణీగారి ఆజ్ఞకోసం ఎదురుచూస్తూ.

ఇద్దరూ కలిసి వుద్యానవనంలో కెళ్ళి - మల్లె పందిరి దగ్గరవున్న చలువరాతి తిన్నెమీద కూర్చున్నారు-విలాసంగా.

'శాంతీ! సర్దారును ఎరుగుదువుగాదూ?'

అత నేంచేశాడో చూచావూ?-' అంది రాణి విచారం సూచిస్తూ.

"కరకుతురకలు, ఎంతటి అమానుషకృత్యాన్నైనా, పాపభీతిలేక చేస్తుంటారు. అదికూడా విడూరమేనా ఏమిటి?' అంది-ప్రక్కనున్న గులాబిచెట్టు పూలుకోస్తూ - శాంతి.

"అబ్బ దానిగ్గాదే. నాకు వుత్తరం వ్రాశాడు"- అంది శాంతిముఖంలోకి చూస్తూ.

'ఆ! వుత్తరమే?' అంది, ఆశ్చర్యంగా శాంతి.

ఇదిగో చూడు-

"గనోరు మహారాణికి-"

మీా అపరూపసౌందర్యం, గాఢంగా - నా హృదయాన్ని ఆకర్షించింది...గనోరు మహారాణి రాజ్యాన్ని కోలుపోయినా,... తిరిగి రాణిగావలెనని...కోరుతున్నాను.

సర్దార్."

అని వున్న వుత్తరాన్ని చూడ్డంతోనే, తోకత్రొక్కిన త్రాచులా చర్రుమని లేచింది- శాంతి.

"శాంతీ! శాంతపడు. తొందరపడితే- కార్యభంగం" అంది, రాణి-శాంతి చేయిపట్టుకొని.

"అమ్మా! ఏమి టీదౌర్జన్యం? మహారాష్ట్ర వనితలు భీరువులై కూర్చున్నా రనుకున్నాడేమో?- ఆపిరికితురక ?"

"శాంతీ! పోనీ, అనుకుంటే మన దేంపోయింది? మనపని మనంచేయడం మనవిధి."

"అయితే సమాధానం ఏమని యిచ్చావు?"

"ఇంకేం యిస్తాను-విధిలేక......"

"ఆ!-మహారాష్ట్ర వంశానికి, మచ్చతెస్తావా?" అంది, శాంతి, కోపంగా-రాణీ ముఖంలోకి చూస్తూ, పాలుపోక.

"శాంతీ! అలాగాదు" అని ఏమిటో ఆమెచెవిలో వూదింది, రాణి-చిరునవ్వుతో.

లోకబాంధవుడు తూర్పుశిఖరాలమీదనుంచి తొంగి చూస్తూ, బవాుచురుకుగా తన అరుణకిరణాలు భూమిపై ప్రస రిస్తూ, పైకి వస్తూవుంటాడు.

సూర్యవియోగానికి ముకుళించబడివున్న పద్మాలు, నెమ్మది నెమ్మదిగా వికసిస్తూ వుంటాయి, ప్రకృతిసహితం తన్మ యత్వం నొందే సువాసనతో.

భానుని అరుణకిరణాలతో రాణిముఖకమలం వాడిపో తుందేమోనన్న భయంతో- శాంతి, రాణిని మహలులోకి తీసికొని వెళుతుంది, జరగబోయే విషయాలు బోధిస్తూ.

* * * *

'నాజన్మ సార్థకమైంది, మీవంటి వీరులచేత ప్రేమింపబడి నందుకు. నేనుకూడా మిమ్మల్ని యుద్ధంలో చూచినప్పటినుంచి తమ్మ ప్రేమించుతున్నాను కానీ, ఫలం లభింపలేదు. ఇప్పుడు మీదగ్గరినుంచి జాబు రావడంవల్ల నేను అమందానందాన్ని పొందాను. ఇప్పట్లో నాకు......స్థిమితం లేదు...కాబట్టి రెండు నెలలు గడచినతర్వాత మనలగ్నానికి ముహూర్తంపెట్టి మీకు కబురుచేస్తాను, అప్పుడు...'

అని వుత్తరం రాణిదగ్గరనుంచి వచ్చికూడా రెండునెలలు దాటిపోయిందే? యింతవరకూ జాబురాకపోవడంకు కారణ మేమైవుంటుంది? అని, గనోరుకోటలో సర్దారు దీర్ఘంగా ఆలోచిస్తూ వుంటాడు, తనగదిలో కూర్చొని.

"ప్రభూ!మీాదరన్నం, కోసం, ఒక స్త్రీ ఎదురుచూస్తోంది" అనే శబ్దం వినబడ్డంతోనే అతని ముఖకమలం వికసించింది. "వెంటనే లోనికిపంపు" అన్నాడు, సర్దారు.

చేతిలో వెండిపళ్లెం పట్టుకుని, సలాం చేసుకుంటూ వచ్చి, అతనియెదుట నిలబడింది, వినయంగా ఓ ఆమె!

'నీ వెవరూ ?' అన్నాడు సర్దారు, ఆత్రుతతో.

'వారి ముఖ్యపరిచారికను' అని తన బొడ్డులో గుప్త పరచిన వుత్తరం తీసి, అతని ఎదుట పెట్టింది-శాంతి.

'ఆహా!' అంటూ, అందుకొని, "అయితే రాణీగారు యింకేమైనా చెప్పారా ?" అన్నాడు, అక్కడికి మనస్సు వుండబట్టక- సర్దారు, ఆత్రంగా!-

"లేదు ప్రభూ!" అంది శాంతి, అతనిముఖంలోకి చూస్తూ.

"నీపేరు ?" అన్నాడు, మెడలోని చంద్రహారం తీసి, శాంతికి యిస్తూ!

అది అందుకొని, 'శాంతి' అని చెప్పి వెళ్లిపోయింది ఆమె.

ఇంకా ఏమిటో చెప్పబోయేడు. కానీ లాభంలేక పోయింది. ఏమీా తోచలా - అతనికి.

శాంతి తెచ్చిన పళ్లెంపయిన కప్పివున్న మఖమల్ గుడ్డ తప్పించి చూచాడు. కళ్లు మిరుమిట్లు గొలిపేట్లు అందులో మధుపర్కాలు, రత్నహారాలు, వజ్రపుటుంగరాలు, సుగంధ ద్రవ్యాలు వున్నాయి.

అవి చూట్టంతోనే, వుప్పొంగిపోయాడు - సర్దారు.

ఇంకొకసారి చీటి విప్పిచూచాడు; మళ్లీ చూచాడు. ఎన్నిసారులు చూచినా, అందులో "ప్రియా! ఈరోజున రెండవ ఝామములో నేనుపంపిన మధుపర్కాలూ, అలంకారాలూ ధరించి రావలెను. ఈరోజు సుదినం. ఈవున్నమనాటి పండువెన్నెల్లో ప్రేమార విహరిద్దాం" అనే వుంది. కాని అతనిమనస్సు మాత్రం క్షణానికి ఒక్కొక్క భావాన్ని మార్చివేస్తుంది.

అతనికి అది కలమో, నిజమో అర్థంగాక ఊహాప్రపంచంలో మునిగి ఎంతసేపున్నాడో అతనికే తెలీదు.

సాయంత్రం అవడంవల్ల తమతమ పిల్లపక్షులను చేరుకోవాలని ఆదుర్దాగా, గుంపులు గుంపులుగా వెళుతున్న పెద్ద పక్షులు చూపరులకు నయనానందకరమైన దృశ్యాన్ని కల్పిస్తూ, కిలకిలధ్వనులతో ఎగిరిపోతున్నై !

దరిదాపులలోవున్న వుద్యానవనాల్లోంచి పరిమళ మిళితమైన పిల్లవాయువులు మెల్లగా వీస్తూ, మానవలోకాన్ని మైమరపిస్తున్నై.

కొన్ని గండుతుమ్మెదలుమాత్రం సూర్యుడస్తమించిన సంగతి మరచి ముకుళింపబడుతున్న తామరపుష్పాల్లోంచి బైటికి రావడం మానివేసినై - పిపాసతో, మాధుర్యాన్ని గ్రోలుతూ.

*        *        *

పున్నమనాటిరాత్రి పుచ్చపువ్వులాంటి పండువెన్నెల కాస్తూవుంటుంది. యమునాతీరమందలి గనోరుమహారాణీయొక్క వినోదమహాలు, దేవిడీగుమ్మందగ్గర కొందరు పరిచారికలు విచ్చుకత్తులతో, పహరా చలాయిస్తూవుంటారు-చురుగ్గా.

కొందరు భటులు కాగడాలతో వెలుతురు చూపిస్తూ వుండగా, సర్దార్ నిరాటంకంగా లోనికి వెళ్లిపోతాడు.

వానితోపాటు స్త్రీ సిపాయీలు లోనికి వెళతారు. తురుష్కభటులు బైట పహరా యిస్తూవుంటారు.

« ఇటు, యిటు " అంటూ శాంతి సర్దారుకు చూపగా, తిన్నగా వెళ్లి రాణికూర్చున్నపాన్పు ప్రక్కనవున్న సుందరమైన సోఫాలో కూర్చున్నాడు, సర్దారు- ఆనందం పొందిన హృదయంతో !

రాణి సంజ్ఞచేయగా పరిచారికలంతా, వెళ్లిపోతారు.

« సర్దారుగారూ!" అంది రాణి, ఆనందాశ్రువులతో నిండివున్నకళ్లతో - అతనివంక చూస్తూ!

అతను తన్మయత్వా న్నొందిపోయాడు. ఏమి సమాధానం యివ్వడానికికూడా తోచలా. 'మహారాణీ!' అన్నాడు, మైమర పుతో.

"మీబోటి సర్దారులవల్ల ప్రేమింపబడినందుకు నా..." అంది రాణి,-దీర్ఘ నిట్టూర్పులు విడుస్తూ!

"కాదు, కాదు, నీవంటి అపరరతీదేవిని చేపట్ట నున్నం దుకు నాజన్మ..." అని యేదో చెప్పబోయాడు- సర్దారు.

"ప్రభూ! మీ రెంతటి ఉదారస్వభావులు కాకపోతే నావంటి అనాథపక్షికి, ఆశయ మిస్తారు?"-అంది రాణి, చిరు నవ్వు కళ్లతో.

"రాణీ! నీ ప్రతిభ, పౌరుషాలు యుద్ధభూమిలో చూచి నప్పుడే నా హృదయాన్ని ఆకర్షించావు. అప్పటినుంచి నీదర్శనం కోసం తహతహాపడుతున్నాను."

అని అంటూఉంటేనే సర్దారు నాలుకపీక్కుపోయింది. "అరె, అల్లారే!" అని కళ్లు తేలవేసి- కూలబడిపోయాడు, పాపం!

రాణి ధీమాగా, మంచందిగి అతని దగ్గర కెళ్లి "మూర్ఖా! యిప్పుడు తెలిసిందా, యీరాణీ ప్రతిభ, పౌరుషం! అధర్మ యుద్ధంచేసి, నాభర్తను చంపినందుకు, విషలిప్తమైన మధు ఘర్కాలు పంపించాను- అనుభవించు" అంది, రాణి-కోపంగా!

"అరె! అ...ల్లా..." అని మూల్గుతుంటాడు-సర్దారు.

"చావు! యెంతటి అమానుషకృత్యానికి తలబడ్డావురా ? తురుష్కాధమా ! నీవంటి పాపభీతిలేనివాడు ఈ శిక్ష అనుభవించవలసిందే"- అని రోషావేశంతో అంది-రాణి.

"అ...రె...అ..."అని ప్రాణాలు విడిచాడు- సర్దారు.

"ఎవ రక్కడ? " అంది, రాణి-లోనికి చూస్తూ!

పరదాలచాటున దాక్కొన్న స్త్రీలంతా నవ్వుకుంటూ, వస్తారు-రాణీదగ్గరికి.

"మహారాణీ ! ఏమయింది ప్రేమ " అంది నవ్వుకుంటూ- శాంతి.

"సర్దారుగారు, స్వర్గానికి వెళ్లారు" అంది- చిరునవ్వుతో రాణి !

* * *

బైట పారాకాస్తున్న భటులకి లోన జరిగిన సంగతి తెలిసి క్రోధావేశంతో, లోనికి ప్రవేశించారు- అసహాయులయిన అబలలను చెరపట్టడానికి.

"శాంతీ !" అని దుఃఖపూరితమైన కంఠస్వరముతో "నీపని నువ్వు కానియ్యి" అందిరాణి - కిటికీలోంచి నిండుప్రవాహమైన, యమునానదిలోకి దూకుతూ !

శాంతి తనచేతిలోవున్న కాగడాను - మహాలుక్రింద భాగంలో, రెండునెలలనుంచి అమర్చి వుంచిన మందుకు ముట్టించింది-మానంకోసం ప్రాణాన్ని లెక్కచెయ్యక !

ప్ర తీ కా ర ం

ఇం కే ముంది ?

మానవతులైన మహారాష్ట్ర మానినీమణులు మానరక్షణ కోసం ఆమంటలో దగ్ధమయ్యారు.

నిర్మలాకాశంలో వినిర్మలంగా ప్రకాశించుతున్న చంద్రుణ్ణి ఒక కారుమబ్బువచ్చి దట్టంగా కప్పింది. 'తనలో పడిపోయిన మహారాణిని- తనలో లీనమొనర్చుకొని - యేమీ యెరుగనట్లు మామూలుగ ప్రవహిస్తోంది' నది.

ఒక గుడ్లగూబమాత్రం భయంలేక, వికృతంగా కూస్తూ నిర్మానుష్యమైన ఆప్రదేశంమీదనుంచి ఎగిరిపోతుంది- సంతోషంగా !

బ ం దు చో డె నా గో జీ రా వు

# ప్రేమభంగం

నే నప్పుడే వెళ్ళాను రూంలోకి. నారాయణ-వెంకటేశ్వర్లు-దుర్గారావు యేదో ఆలోచిస్తూ కూచున్నారు. పుస్తకాలు, కొన్ని పత్రికలు చెల్లాచెదరుగ పడివున్నాయి. వా రదేమీ గమనించకుండా, సిగరెట్లు పీలుస్తూ రూమంతా చీకాకు - అసహ్యము చేస్తూ - ఏదో ఆలోచిస్తూ కూచున్నారు. 'ఏమిట్రా? ఏదో ఆలోచిస్తూ కూచున్నారు?' అన్నాను నేను.

మా నారాయణ నామాట వినిపించుకోకుండానే "మంచి పని జరిగింది, మొత్తంమీద. లేకపోతే ...మన రామంవల్ల యేమవుతుంది! ప్రతిపనికీ నేనని, జొరబడతాడు. మంచి శృంగభంగమయింది. ఇక యెన్నడూ యిట్లా స్వతంత్రంగా బయలుదేరడు. ఇక వీడిమీద విరక్తిపుట్టే వుంటుంది దానికి,..... పయిగా మనం యిక్కడనుండి, మకాంయెత్తేయాల్సొస్తుందేమో"

'అరే! యేమిటి సంగతి? అసలు యిప్పు డేమయింది?' అంటూ చాపమీద చతికిలబడ్డాను.

'ఇం కేం కావాలీ! మనరామం లేడూ? వాడికీ - మన కెదురుగా ఆయింట్లోవున్న నర్శింహులుభార్యకూ - గ్రంథం నడుస్తున్న దటే!'

ఎవ రన్నారు? నీ కెట్లా తెలిసింది?' అన్నాను, ఆశ్చర్యపోతూ।

'ఇదుగో' మనరామంగాడే,...ఏడీ, వీడు?

"ఇప్పుడే, వెళ్ళానులే, ఒకటికివస్తే, బయటకు. నువ్వే చెప్పు ఫర్వాలేదు, చెప్పు" అని అంటూ రామంవచ్చి కూచు న్నాడు.

"ఏమిటిరా రామం!-ఏం జరిగిం దేమిటి?" అని నేనన్నాను.

'మనం యీ రూంనుండి మకాం యెత్తేయాల్సిందే' అన్నాడు, నవ్వుతూ దుర్గారావు.

'నర్సింహులు నీకు మంచిస్నేహితుడు కదా!' అన్నాడు, నారాయణ.

'ఇప్పుడు మాత్రమేం!' అన్నాను నేను.

'ఇకనుండి, విరోధం పడవలసివస్తుంది' అన్నాడు తిరిగి నారాయణ.

'అసలు-నర్సింహులుకు నేనంటే యెంతో ప్రేమ. ఎక్కు-వస్నేహంతో చూస్తూంటాడు. వాడు నాకు క్లాసుమేటు, నాకంటే రెండుసంవత్సరాలు పెద్దయినా - యిద్దరము ఒక క్లాసులోనే -నేనుఫస్టుగనో, వాడు ఫస్టుగనో-మార్కు-లు సంపా దిస్తూ చదువుకున్నాం!......తరువాత వాడికి, శారదాబిల్లులో పెళ్లిచేశారు. కొద్దిగ తలతిక్క-మనిసి, గడుసరి. రెండుసంత్సరా లయిం దేమో కాపురంచేసి......అప్పుడపుడు మన రూం విష యంగురించి నాతో మాట్లాడుతూ వుంటాడుగూడా!...... అటువంటివాడితో, విరోధమా!' అన్నాను నేను.

'రామంమూలకంగా పడాలి' అని అందుకున్నాడు.' వెంకటేశ్వర్లు.

'మేం, యిట్లా మాట్లాడుకుంటుంటే - పెద్ద హీరోలాగా కూచున్నాడు...తననుగురించి, యెప్పుడు యేంవచ్చి మీదపడు తుందోననే భయంతో! యిట్లామాట్లాడు కుంటున్నా, యేమీ చలించకుండా, రామం.'

'ఏమిటిరా? అసలు' అని నే నన్నాను.

'ఒరేయ్! చెప్పేసి - అంతా ఒప్పుకో!' అన్నాడు' ఒకడు.

'అంతా చెప్పిందాకా ఒదిలిపెట్టొద్దు' అన్నాడు ఇంకోడు.

'వొరే, రామం! ఇహ లాభంలేదు - అసలుసంగతి చెప్పా లిసిందే!' అన్నాను.

అప్పుడు రామం - మీరందరూ నేనుచెప్పేది, పరమ రహస్యంగా వుంచుతామని నాచేతిలో చేయివేస్తే - జరిగిన దంతా చెపుతాను అన్నాడు.

అందరూ ఒప్పుకొని చేతులో చేయివేశారు.

అప్పుడు రామం యిట్లా చెప్పాడు-

'......అనకూడదు కానీ- ఆయనకు స్త్రీవ్యసనం జాస్తీ. అందువల్ల ప్రతిఆడదానితో— ఆఖరుకు మాలదికూడా! తెలి యలా?...అంత కక్కుర్తి పడతాడు. ఇది అంతా నర్సింహాలు భార్యకు చాలా కష్టంగా తోచింది. అసలే వాళ్ళది పెద్దకుటుంబం.

కావాలన్నప్పుడల్లా యింతదగ్గిరగా కూచుని, భార్యాభర్తలు మాట్లాడుకోవటానికి వీల్లేదు.

ఎప్పుడయినా అవకాశం చేసుకుందామని అయినా ప్రయత్నంచేయడు. అంతకంటే భార్యకూడా చేయదు. అతడు భోగం కొంపలలో రాత్రుల్లెవుండి, పదిగంటలకో వస్తాడు-ఉదయం, యింటికి !

ఒకవేళ, భార్య అందాంతక్కువది అందామా? అదీ వీల్లేదు. చూస్తూనే వున్నారుగా ఆయమ్మాయిని! మరి నర్సింహులు యిట్లా వుండటమునకు కారణం చెప్పలేము. ఆయమ్మాయికి ఆఖరుకు మొగుడిమీద విరక్తిపుట్టింది.

మనం కొద్దిరోజులకు, నాటకం ప్రాక్టీసుకోసం యిక్కడ రూం పెట్టాంగదా!......తరువాత ఏమయిందంటే!

ఆరోజున రూంలోకి, అంతవరకు ఎవడు రాలా?... నేనొక్కడనే, కూచుని పాటపాడుకుంటూ వున్నాను. పాడుతూనే కుర్చీలోనుండి, కిటికీగుండా - ఆయింటివేపు చూచాను. ఆపిల్ల వాళ్లవాకిట్లోనుండి నావేపుచూస్తూ - నాపాట వింటూ నిలుచుంది.

అప్పుడప్పుడు వాళ్ళ బయటకిటికీలోనుండి, తాను మన రూంలోకి చూస్తుండేదట ! మనపాటలు, మనరిహార్సల్సు అన్నీ శ్రద్ధగా వింటుం డేదట ! ఒంటరిగ ఉంటుందేమో మన్మథు-డేమయినా, తనపంతం నెగ్గాలని నారిసారించాడేమో—చెప్పలేము.

భర్తసరిగ్గా చూడ్డంలేదేమో!...మరి మనరూం కెదురుగావున్న
మనిషామెను, కాస్త కాండపెంచితే,—తెలిసి నువ్వేమయినా
చీవాట్లేస్తావేమోనని భయంతో—మన కెందుకీగోల అని ఆఉద్య
మంలో కాలు తొందరగా పెట్టలేదు. రెండునెలు గడిచినవిలా!

రూంలో ఒంటరిగ కుర్చీలో కూచుని, పోర్షను చదువు
కుంటూ వుండేవాడిని. ముస్తాబై అపుడపుడు, రూంలో యెవరూ
లేనిసమయంలో, - విప్పారిన కళ్ళతో చూస్తూ - రూంమీదుగా
వెళుతుండేది. ఒకరోజున నవ్విందికూడాను. ఇంకేం, పొదలో
వున్న పులిమీద రాయివేసినట్టయింది.

ఆరోజంతా ఆమెమీదకు పరుగెత్తింది నామనస్సు. నిజా
నికి నర్సింహులు భార్య చాలా అందమయిన మనిషి. ఆ బంగారు
ఛాయ, ఆ కోలమొహం, ఆ కాటుకకళ్ళు, నవ్వితే గుంటలుపడే
ఆ చెక్కిళ్ళు, ఆచీనాలరంగు కుంకుంబొట్టూ - చూస్తే ఎవరి
కయినా వ్యామోహం కలక్కతప్పదు. అదివరకు మామూలుగా
ప్రతిరోజూ చూస్తూవుండటం వలన మామూ లనుకున్నాను.
కానీ!...ఆరోజున ఆ అమ్మాయి నావంకచూచి అట్లా నవ్వడం
యింటికి తిరిగి వెళ్ళేటప్పుడు రూంముందు క్షణంఆగి, మంద
హాసం చేయడం - యింట్లోకి వెళ్ళి తిరిగి కిటికీవద్దకువచ్చి ఆగి, కడ
సారి చూపుగా చూసి లోపలకు వెళ్ళడంతో -నాఆశలన్నీ అంకు
రించినయి. పాచికపారిం దనుకున్నాను. ప్లానువేశాను యెట్లానా?
అని.

సరే! మళ్లీసాయంత్రం కిటికీదగ్గరకు వచ్చి నిలుచొని - ఇంట్లో యెవరూలేరు కాబోలు, కటాక్ష వీక్షణాలు పారవేస్తూ వుంది, మనమీద! అటూఇటూచూచి చెయ్యి విసిరాను నేను.

చెయ్యివిసిరి, వెంటనే అటూఇటూ చూచాను — ఎవరయినా చూచారేమో అని, గుండెల్లో పీచుపీచుమంది. మళ్ళీ ఆవిడ వైపు చూచాను. ఆవిడ నవ్వి, తలకాయవంచుకుంది. ఇక నాకు ఆ అమ్మాయినిగురించి అనేక అభిప్రాయాలు కలిగాయి... ఆ అమ్మాయిభర్త - నర్సింహులు ఎప్పుడూ యింట్లో వుండడు. పయిగా చాలారోజులు యింటికిగూడా రాడు. ఇది అంతా చూస్తునేవున్నానుగా! ఇఖ మాయిద్దరకు సావాసంకలగటానికి అభ్యంతరం ఏమిటి? అనుకొని ఊటలు మింగాను. కానీ, -ధైర్యం చాలింది కాదు. నలుగురువున్నయింట్లో ఆపిల్లతో స్నేహం... యెట్లా? అనే భయం కలిగింది. గుండెలు టువ్వుటువ్వుమన్నాయి, మనసంగతి తెలిసిందేకదా, అందరికీ!

నాకు అవకాశాలు - బోలెడన్ని కలిగినై... **కానీ!** కాళ్ళుమాత్రం నాకు ఎదురు తిరిగేవి. మాట వినేవికావు! ఆవిషయం తలిస్తే ఒళ్ళంతా చిరుచెమట పుట్టేది. 'ఆఖరుకు - ఆపిల్లే తనంత తాను చేయిచాపి పిలిస్తే!—తరువాత మనంతట మనం వెళ్ళొచ్చు' అనుకున్నాను. నమ్మండి నమ్మకపోండి - తదుపరి దాదాపు అంతపనీ చేసింది, ఆ అమ్మాయి.

నేను తెగించి వెళ్దామనుకున్నాను గాని, లాభంలేక పోయింది. నాకంటేముందు నా కాళ్లు సమ్మెకట్టేవి.

ఆపిల్ల రూంముందు రోజుకు అయిదారు సార్లు అటూ యిటూ తిరిగేది. నావంక చూస్తూ అట్లాతిరుగుతుంటుంటే, శరీరం చలికాలంలో బిగుసుకుపోయేట్టు కొయ్యబారిపోయేది! సరిగ్గా ముఖమన్నా చూపించేవాణ్ణికాను — ఆఖరుకు దస్తమ్మనై పోయాను.

మూడు రోజులక్రితం మీరంతా ఫుల్ రిహార్సుచేసి వెళ్లి పోయారు. నేనొక్కడినే యింటికి వెళ్లలేక పడుకున్నాను. ఆరోజు రాత్రి నేను కునికితే ఒట్టు! ఆరాత్రి అనేక ఆలోచనలు కలిగాయి - 'బైటకు వస్తుందేమో! యీరాత్రికి తప్పకుండా...'అని తలుపులుతీసి రూం బైటకు వచ్చి నిలుచున్నా! ఆరోజున నిజంగా వాకిట్లో నిలబడి, మన రూంవంక చూస్తూ - నావేపు చూస్తూ నిలబడివుంది, ఆయమ్మాయి!

మనసులో యెంత వుబలాట పడుతున్నానో!—అంత విధిగా నాశరీరము ఆయమ్మాయివద్దకు వెళ్ళేటందుకు భయపడింది—అంతవరకు ఆమెభర్త యింట్లోకి రాలేదని నాకు తెలుసు. మరి ఏం లాభం?—అట్లా పావుగంట గడిచింది. చివరకు ఆపిల్ల విసిగి లోపలకు వెళ్లిపోయింది.

తిరిగి నాకు పశ్చాత్తాపం కలిగింది. ఇటువంటిఛాన్సు - నాజన్మలో, యెక్కడా యింతవరకు దొరకలేదు. వృధాగా పోగొట్టానే—యీసారిగాని తిరిగివస్తే పోగొట్టకూడదని - తీర్మానించుకొని, రూంలోకివచ్చి - పడుకుని నిద్రపోయాను.

తిరిగి మళ్లీరాత్రి ఆపిల్ల అట్లాగే, షుమారు 12 గంట లప్పుడు బయటకు వచ్చింది. నే నది రూంకిటికీలోనుండి చూసి, బయటకు రాకుండా అట్లానే పడుకున్నాను.

ఒక అరగంట ఆగి రూంవద్దకు వచ్చి - తలుపుమీద మెల్లిగా చిటికెలుకొట్టింది, ఆ యమ్మాయి. నేను లేవలేదు. ఒకవేళ ఆయమ్మాయే తెగించి కిటికీతెరచి పిలుస్తుందనుకొని భయపడ్డాను. కానీ!——ఆవిడ అటువంటి పనేమీచేయలేదు. నా ఉత్సాహమంతా చల్లారిపోయింది.

ఏదోకాస్త చప్పుడయితే; తలుపు తీస్తాననుకొని మళ్ళీ కొట్టింది - నే నెంతసేపటికీ లేచి తలుపుతీయలేదు. తరువాత విసుగుపుట్టి వెళ్లిపోయింది, ఆయమ్మాయి! ఆయమ్మాయి అట్లా పిలుస్తుంటే! నా కేం తోచిందికాదు. ఆడదానివలె భయపడి సిగ్గుతో పడుకున్నాను.

'ఓరి దద్దమ్మా! ఆఖరుకి యిట్లా చేశావేం? బలేఛాన్సు! నీవల్ల ఏమౌతుంది? దద్దమ్మవేగా!' అని దుర్గారావు అన్నాడు.

అవునులే——నీవేగాని అప్పుడు, ఆరంగంలోవుంటే తెలి సేది......నాకప్పు డేం తోచిందికాదు......అట్లా పడుకున్నా నేకాని - నిద్రకూ నాకూ ఏమీ సంబంధం లేకపోయింది. అనేక ఆలోచనలు కలిగాయి - 'ఆయమ్మాయి తనంత తాను వలచి వచ్చి పిలుస్తుంటే! నా హుషారు అంతా జారిపోయినట్లయింది.

అరగంటసేపు అట్లా ఆలోచిస్తూ పడుకొనివుంటే- మళ్లీ అహం పొడుచుకవచ్చింది.

'ఆఁ! నీమొహం! అహం. ఇట్లా ఆయమ్మాయివచ్చి పిలుస్తుంటే-ఆడదానివలె తప్పించుకొని, ఆయమ్మాయి ప్రేమంతా భంగంచేశావు కదరా! క్రియలో శూన్యమే! నువ్వు' అని అన్నాను నేను.

'వుండండి' సాంతం విని మాట్లాడండి. తరువాత-

ఇట్లావచ్చి ఆయమ్మాయి పిలుస్తుంటుంటే- ఈఛాన్సు పోనీయకూడదనీ - బాగుండదనీ అనుకొని వెంటనే లేచాను.

లేచి రూంతలుపులు దగ్గరకు వేసి - వాళ్ళయింటివద్దకు వెళ్ళి కిటికీతలుపులు కొట్టాను, 'మెల్లిగా! కొట్టి ముఖం కనబరచకుండా పక్కకు నిలుచున్నాను, లేచి వస్తుందేమో! అని.

వెంటనే ఆ యమ్మాయి వచ్చి కిటికీతలుపులు కొద్దిగా తెరచి చూచింది. నిజంగా ఎంతబాగుం దనుకున్నావు-ఆ మొముఖం ఆవెన్నెలలో! చెవుల దిద్దులు, దగదగలాడుతూ వున్నవి - ఆ ముక్కుకువున్న ఒంటి ముక్కుపుడక, రవ్వ పొదిగివున్న దేమో తళతళా మెరసిపోతూ వుంది!

ధైర్యంతో ముందుకొచ్చి తొందరగా ఆ చువ్వల సందులోనుండి చేయిపోనిచ్చి ఆవిడ చేయిపట్టుకోబోయినాను. వెంటనే ఆవిడ రెక్కలు ముయ్యబోయింది.

అయ్యో! చేయి నలిగిపోతుంది అని బాధపడిపోయాను. ఆవిడ రెక్కలు కొద్దిగ తెరచింది. వెంటనే చేయిపట్టుకొని 'తలుపుతీయి పొరపాటయింది - ఇందాక నువ్వువచ్చి పిలచినప్పుడు మేలుకొనేవున్నాను' అని బ్రతిమాలాను.

ఇంట్లో యింతలో యేదో అలికిడిఅయింది. ఆవిడ వెనక్కుతిరిగి చూసింది. నేను నెమ్మదిగా ఒంటిమీదకు చేయి పోనిచ్చాను. 'ఆ అమ్మాయి అంతకుముందే - నేను యిల్లా చేసినందువల్ల - నామీద కోపంగావుందిగామరి- కనుబొమ్మలు ముడిచి - 'సరేలెండి! - వెళ్ళుదురూ యీపాటికి. మీకంటే - ఆ సన్నగా యెర్రగావుండే కుర్రవాడే చాలా మంచివాడు' అని మన నారాయణరావుని గురించి చెపుతూ, నెమ్మదిగా చేయి యివతలకు నెట్టింది, విరక్తితో!

'అయితే పాపం!—ఆ యమ్మాయిని చాలా దగాచేసి- నీపై ప్రేమంతా పాడుచేశావు, ఇంతకూ? నీ వెప్పుడూ యింతేగా! నీ దగ్గర సత్తాపదిరా కార్తిక్!' అని దుర్గారావు నవ్వుతూ అన్నాడు.

'ఆ అదృష్టం పట్టలేదోయ్ మనకు - మరి ఏంచేయను' అన్నాను, సిగరెట్టుకాల్చి పొగవలయాలుగా వదలుతూ!

మోదుకూరు వేంకటేశ్వర్లు

# నీకోసం

పొట్టకూటికోసం, యెర్ర ఎండలో యెంకి, వేరు శనక్కాయలు చెరుగుతూంది. ప్రచండమైన ప్రతాపాన్ని ప్రకటిస్తూ, బాలభానుడు తన వుష్ణకిరణాల్ని పంపి ప్రపంచాన్నంతా దగ్ధంచేస్తున్నట్టుంది వేడి ప్రభావం.

పొట్టకూటికే గతిలేక - పగలల్లా యెర్రయెండలో విసుకూ విరామం లేకుండా పనిచేస్తున్నా - పాషాణహృదయుడైన పిచ్చయ్య మనస్సు - ఆమెకు పావలాకంటే యెక్కువ యివ్వడానికి వెనకాడుతుంది.

అది దాని ఖర్మంకాకపోతే, మిలమిలలాడే కళ్ళతో - నిగనిగ లాడే శరీరంతో - కరకరలాడే వయస్సులోవుండి, అలా శనక్కాయలు చెరగటం యేమిటి?

యెంకి యేలఖాధికారింట్లోనన్నా పుట్టివుంటే, కాలు క్రిందపెడితే కందిపోతుందేమో! - మాట్లాడితే ముత్యాలు రాలిపోతాయేమో! నని యెంత జాగ్రత్తగా చూడబడేది?

పగలల్లా కష్టపడ్డందుకు ఫలితం పావలా వచ్చేది. ఇంటి దగ్గరున్న పిల్లలు తల్లికోసం యెదురుచూస్తుంటారు. యెంకి యింటికి వెళ్ళగానే - "అమ్మా! అమ్మా!" అంటూ కౌగలించుకొని తల్లిమొహంకేసి చూస్తారు—యేవన్నా పెట్టమన్నట్టు.

అందరికీ సమాధానంగా - కన్నీరు కార్చేది, యెంకి. తను తెచ్చినడబ్బులు- పొట్టకూటికే వస్తాయా?-పిల్లల చిరుతిండికే వస్తాయా? అని విచారించేది.

అది దానిఖర్మంకాకపోతే-ప్రతినెలా పాతికో ముప్ఫయో సంపాదించే భర్త, దుర్వ్యామోహాల్లోపడి-పసితనంలోనే మృత్యు దేవతఆకలికి ఆహారం కావాలా!

ఇంతకీ పాపం! యెంకి తనూ, తనపిల్లలూ సుఖంగాతినికి హాయిగావుండే యోగం లేదు...మరి.

ఇద్దరు పిల్లలూ, తనూ బ్రతకడంకోసం - పొట్టకూటి కోసం - యేపనిచేస్తేనేమట్టు కేం తప్పు? అని కూలి కెళ్ళేది.

కాలవైపరీత్యం! యెంకి - తనభర్త బ్రతికివున్నప్పుడు తానూ ఒహ "టాయిలెట్టే" అందరిలా. యిప్పుడో? పాపం కూటికీ, గుడ్డకీ గతిలేక "మలమల" మాడిపోయే బికారిణి. భర్త బ్రతికివున్నప్పుడు అతనెంత దుర్వ్యామోహాలతో దగ్ధమైనా - భార్యనుమాత్రిం చాలా 'నీటు'గా వుంచేవాడు; తన దుర్వ్యసనం, మాన్పుకోలేకపోయినా!

* * *

యేమే, యెంకీ! యింత ఆలస్యం...? అని పిడుగుపడినట్టు గర్జించాడు పిచ్చయ్య.

అంతవరకూ "పీచుపీచు" మంటున్న - యెంకిగుండె లాకేకతో గతుక్కుమన్నాయి. నఖశిఖ పర్యంతం 'గజగజ' వణికి పోయింది - యెంకి.

మాట్లాడవేం? మూగమొద్దులా నిలబడ్డావేం? యిలా అయితే నా పనిలోనుంచి తీసేస్తా! అన్నాడు కర్కశంగా.

పిచ్చయ్య పలుకులు వింటున్న యెంకీ, పెనుగాలి కల్లాడే తీగెలా "గజగజ" వణికిపోయింది నఖశిఖ పర్యంతం - తన బ్రతుకు తెలు వెలానా? మిగిలినపిల్ల నెలా పోషించాలా? అని లోలోపల అనేకవిధాల విలపించింది.

యేం? యెందు కాలస్యమైంది? అని మళ్లీ అడిగాడు.

బాబయ్యా! పొట్టకూటికి కష్టపడే నేను, నా స్థితికే యేడుస్తూంటే - మాయదారి భగవంతుడు నా "బుచ్చి" నెత్తుకెళ్లాడు! అంటూ కంటికి కడివెడు నీరు కార్చింది.

మంచిదేగా! సగం బరువు తగ్గింది. లేకపోతే - యీ కరువురోజుల్లో - నిన్ను నీవే పోషించుకోలేక పోతూంటే - పైగా ఆ పిల్లలెందుకు - పీడా?- అని లేశ మాత్రమయినా కరుణ లేకుండా, కఠిన హృదయంతో - చుట్టకాల్చుకుంటూ శసక్కాయరాశిని-చూస్తున్న పిచ్చయ్యఅన్నాడు. అలాఅంటూంటే యెంకి మనస్సు కోపోద్రేకపూరితమైంది. కాని యేంజేస్తుంది? యేకాకి. పొట్టకూటికి ఆశించి పనిచేస్తుంది గనుక - యేమీ అనలేకపోయింది.

సరే; పో, పనిలోకి.........!అంటూ నెఱసిపోయినతన గడ్డాన్ని - నిమురుకుంటూ వెళ్లిపోయాడు - ఆరిపోయిన చుట్టను వెలిగించుకొని.

యేడుస్తూ - యథాప్రకారంగా చేటలోని శనక్కాయలు చెరగటం మొదలెట్టింది.

గోరుచుట్టుమీద రోకలిపోటులా - అంతవరకూ అమ్మా అమ్మా! అంటూ పిలిచే - ఆశకూడా అడుగంటిపోయింది - పాపం! డబ్బులేకపోయినా అష్టకష్టాలుపడి కన్నబిడ్డల్ని ప్రేమతో పెంచుకుంటున్న యెంకిని చూచేవరకు భగవంతుడికళ్లు మండినై కాబోలు! మిగిలిన నలుసునుకూడా నాశనం చేశాడు - నిర్దాక్షిణ్యంగా!

బిడ్డని కోలుపోయిన తల్లి దుఃఖం - అలా బిడ్డల్ని కన్న తల్లులకే తెలియాలి! పాపం! అల్లారుముద్దుగా పెంచుకుంటూన్న - ఆ రెండుపక్షుల్ని దేవు డా విధంగా తల్లి నుండి వేరు చేసినందులకు కంటికీ మంటికీ యేకధారగా యేడ్చింది.

మనోవ్యాధితో యెంకి కృశించి శల్యావశిష్టమై పోయింది.

చిక్కి శల్యావశిష్టమైన యెంకి పనిచేస్తూంటే - పదిరోజుల క్రిందే పట్టణంనుంచి వచ్చినసుబ్బారావు (సుబ్బయ్యకొడుకు) యెంకిని జూచి జాలిపడ్డాడు. దగ్గరగావచ్చి 'యెంకీ!' అని పిలిచాడు.

ఇంత ఆదరంగా నన్ను పిలిచే దెవరబ్బా! నన్ను కనికరించి పలుకరించే వారింకా యీప్రపంచంలో వున్నారా? అంటూ అటూ, ఇటూ చూచింది.

పదిగజాల దూరంలో 'ప్యాసింగ్షో' సిగరెట్టు కాలుస్తూ పొగతో పిల్లమేఘాల్ని కలిపించే- అతన్ని చూచింది. పయిట సర్దుకొని, ముఖాన చెమట తుడుచుకుంటూ - వస్తున్నా బాబయ్యా! అంది.

పసిడినిగ్గులుదేలిన బంగారు బొమ్మలాంటి మెంకి అందాని కానందమొందాడు; కిన్నెరకంఠా న్నతిక్రమించే ఆమె కంఠమాధుర్యానికి ఆశ్చర్య పడ్డాడు.

మెంకీ! నిన్ను చూస్తుంటే - నా కమితమైన జాలి కలుగు తుం దెందుకో! కఠినమైన యీకూలిపనికి నీవు రావడంయెందుకు? అన్నాడు సుబ్బారావు.

పొట్టకూటికోసం బాబూ! యేం జేయమంటారు? అంది నిరుత్సాహంగా -మెంకి.

పొట్ట కూటికోసం - యింత యెర్ర నెండలోనా!, నీవా! కూలిచేయడం? యెవ్వరూ లేరా నీకు? - అంటూ యెంతో ఆదర ణగా అడిగాడు.?

సుబ్బారా వడిగిన మాటలకి- మెంకి వెంటనే సమాధానం యివ్వలేకపోయింది. అతికష్టంమీద 'యేకాకిని బాబూ!' అంది. ఆమాటతో సుబ్బారావు మనస్సుకి గాయం తగిలినట్టుంది.

మొంకిదగ్గర నిలుచుని మాట్లాడే సుబ్బారావు - దాని కళ్ళలోవుండే 'బెదురు'- పెదవుల్లోవుండే 'బెదురు' -విశాలమైన 'నుదురు'- చూచి ముగ్ధుడైపోయాడు.

అతనికి ఆమెమీద అదోవిధమయిన......యేర్పడింది.

మొంకి నాకర్షించిన అతని మనస్సు - స్వాధీనం తప్పి పోయింది. అర్థంలేని ఆలోచనలు పరుగెత్తుతున్నాయి - అతని బుర్రలో. ఆమెనుగురించే ఆలోచించేది, అతనిమనస్సు - యెప్పుడూ. 'మొంకిని' నిరంతరం తన ముందుంచుకొని - విశాలమైన ఆమె నేత్రద్వయాన్ని కన్నులపండగ్గా చూస్తూ, ఆమెను తన బాహువల్లికల్లో యిముడ్చుకొని మహదానందం అనుభవించా లనిపించింది. అతనిమనస్సు నావికుడులేని పడవైపోయింది.

రోజూ రోజూ, యేదోసమయం కనిపెట్టి - సర్దాగా కాలక్షేపం చేసేవాడు ఆమెతో.

ఆమె ఆశాపూరితమయిన తన విశాలనేత్రాలతో - అదో విధంగా-చూచేది, ఆనందంగా. మొంకి ఆనందం-చూచి సుబ్బారావు వర్ణించితే ఆమె చెప్పలేనంత ఆవేదన ననుభవించేది. యెందుకు?

ప్రపంచంలో 'కూలి' అంటే అతినీచమైంది. ప్రతివారు వీళ్ళమీద 'పవర్' చెలాయించేవాళ్ళే నిరాదరణగా.

పిచ్చయ్య కేకలకే హడలిపోయే మొంకిని - మరీ బాధించేది గయ్యాళమ్మ - యింటిపనులు కూడా ఆడబ్బుతోనే చెయ్యమని.

స్త్రీ అయివుండి అలాబాధించడానికి ఆమె కర్కశ హృదయం వెనుదీయడంలా. పాపం, మెంకిగతి యెంతనీచం? ఆహా!___

*　　　*　　　*

సాయంత్రం నదీ తరంగాల్లోనుంచి మంద మందంగా వీచేగాలి, పగలల్లా కష్టపడి పనిచేసి, అలసటపొందిన కూలీల కానందం కలిగిస్తోంది.

సూర్యుడు మహా త్తరమైన అపాయస్థితిలోవున్న - నన్ను రక్షించడాని కెవరూ సాయంరారూ?- అంటూ, చిన్న బుచ్చు కొన్న మొఖంతో తన కాంతినంతా కోల్పోయి - పశ్చిమ సముద్రింలో మునిగిపోతూంటాడు.

మంద మందంగా వీచే మలయమారుతాన్ని అమందా నందంగా పీలుస్తూ, దూరదూరంగా కూర్చొని వున్న యువతీ యువకులు చెఱువుకట్టమీద, నయనానందకరంగా ప్రకృతిని తిలకిస్తూ, కూర్చొనియున్నారు.

ఆ సమయంలో మెంకి బరువెక్కిన హృదయంతో యింటికి కెళ్తూంది, మంద మందంగా నడుస్తూ.

చిరు చీకట్లో నిలుచునివున్న సుబ్బారావు - నీరసంగా వస్తూన్న మెంకిని చూచాడు. మూల మలుపుకు రాగానే - మెంకీ! అంటూ చెయిపట్టుకోబోయాడు.

ఎవరు? యేం బాబూ! - అంటూ, ఆదుర్దాగా దీనత్వం ఉట్టిపడేట్టు - అడిగింది - వెంకి.

అరవకు; మెల్లిగా మాట్లాడు - నేనేలే - యెఱుగవు? సుబ్బారావుని అన్నాడు - "దడదడ" ల్లాడే గుండెల్తో!—

మీరా? అయ్యో, నన్నిలా పట్టుకోబోతా రెందుకు? అమ్మో! ఆ చేతులో దేమిటి? "ధగధగ" మెరుస్తుందేమిటి? నన్ను చంపుతారా! - చంపకండి- నే నేం తప్పుజేసానో చెప్పి చంపండి. చూడండి! ఆ కత్తెలా చూస్తోందో నా రక్తాన్ని తాగడానికి-అంటూ పిల్లిని-చూచిన యెలికలా అయిపోయింది.

వెంకి కళ్లు అదురుతున్నయి - హృదయం బెదరి పోయింది.

* * *

తడ బడుతూన్న - అడుగుల్తో, సుబ్బారావును వెంట బెట్టుకొని - యింటికి తీసుకెళ్లింది - వెంకి.

వెంకి దొక తాటాకిల్లు. ఒహమూల మంచం, చింకిరి చింకిరిగావుంది. సామాన్లు వెంకిదారిద్ర్యాన్ని వ్యక్తపరుస్తున్నై. యింటికి రాగానే వెంకికి భయంతేరింది.

ఆమె నలా కూచోబెట్టి దీపం వెలిగించిన తరువాత సుబ్బారావు - అంతవరకూ, తనచేతులో గుప్తంగావుంచిన వస్తువును చూసాడు.

'యే కళ్లో' అనుకుని గాబరాపడిన ఆమె మనస్సు మడచివేసిన "ధగధగ" మెరిసే గజ్జలవస్త్రాణాం చూడడాని కాశ్చర్య పడింది. క్షమించండి, బాబూ! అంటూ కాళ్ళమీదపడింది.

మెంకీ! నీకు నామీద ప్రేమవుంటే, దీన్నితీసుకో! నన్ను నీతో......అన్నాడు సుబ్బారావు ఉచ్ఛ్వాస నిశ్వాసాలు నెమ్మదిగాపీలుస్తూ!.—

బాబూ! మీరు భాగ్యవంతులు, నేను కూటికి గుడ్డకీ గతిలేక అల్లాడే అభాగ్యురాలిని. అనంత సౌఖ్యాలూ అనుభవించవలసిన మీరు - యిలా నాబోటి.........న్యాయంగాదు. నన్ను యిలానే బ్రతకనివ్వండి. బాబూ! క్షమించండి అని భయకంపిత స్వరంతో అంది మెంకీ.

మెంకీ! నామాట విను. "నీకోసం" ఎంతపనికయినా వెనుదీయను. చూడు; నీకు కావలసినంత డబ్బు.......

వద్దు, బాబూ! వద్దు. నేను కులానికి పేదనైనా శీలానికి మాత్రం అంత నీచురాలిని గాదు. నన్ను దుర్మార్గపు దారిలోకి నడిపించకండి అంది.

కాదు, మెంకీ! నీవు నిండు యవ్వనంలో — భర్తను పోగొట్టుకొని, నీ నూరేళ్ల బ్రతుకు — అడవిన కాచిన వెన్నెల్లా యెందుకు పాడుచేసుకోటం? చూడు "యెంతమంది 'వితంతువులు' వివాహం చేసుకోడంలా 'మళ్లీ మళ్లీ' అలానే నీవ్వానూ......!"

బాబూ! నాకుమాత్రం అది యిష్టంలేనిపని. మీరు పశుబలం ప్రయోగిస్తే........నా శీలం కాపాడుకోవడం నావిధి...తరువాత మీ దయ...అని తన అయిష్టత తెలిపింది.

మనస్సులో నిర్మించుకున్న - మహాదాశయాలు మంట గలిసి పోయినందుకు దుఃఖించుతూ, కూటికీ గుడ్డకీ గతిలేక పోయినా, శీలరక్షణకు పాల్పడేవెంకి ఆశయా న్నభినందించాడు కాని - "ఆమె తన ప్రేమని అంగీకరించితే యెంత బాగుండును?" అనుకున్నాడు, సుబ్బారావు.

సరేలే, వెంకీ! నేను పశువును కాదు. నాకూ ఆత్మవుంది. నిన్నలా బలవంతం చెయ్యనులే! కాని, యెప్పటికయినా- నీ మనస్సు మారితే - నీతో ఆనందా న్ననుభవించే "ఛాన్సు" మొట్టమొదట నాకే.....అంతవరకూ 'నీకోసం' అవివాహితుడనే! వెళ్తున్నా, వెంకీ! వెళ్తున్నా - అంటూ నిరుత్సాహంతో దారినబడ్డాడు.

* * *

ప్రపంచంలో - యిలాంటి పరిస్థితులకు, తన స్థితిని విచారించి - వెంటనే ఆగ్రామం వదలా లనుకుంది. తక్షణం కన్నుపొడుచుకున్నా కనుపించని చీకట్లో - పొలాలగుండా, పోతోం దెక్కడికో - వెంకి.

ఆరోజుమొదలు, అదేవిచారంవల్ల ఆరుమాసాలనుంచీ మంచంలో అవస్తపడుతున్న - సుబ్బారావు కీసంగతి తెలిసింది.

శక్తి యెలావచ్చిందో - మరి. నిస్సారమయిన - తన శరీరాన్ని అతికష్టంమీద మోసుకుంటూ - తడబడుతున్న అడుగుల్తో మెల్లగా నడుస్తూ బయల్దేరాడు. ప్రేయసిని వెదక డానికి - సుబ్బారావు.

విన్నదానికి సరిగ్గా ముందువెళ్తుంది యెంకి. "యెంకీ— యెంకీ!" అంటూ వెంబడించాడు - సుబ్బారావు.

—ఆమె వినుపించుకోలా......—

"ఆగు యెంకీ! ఆగు! ఒక్కమాట" అంటూ వణకి పోయే కంఠంతో - తడబడే కాళ్ళతో - 'సరసరా' ప్రాకి పోయే......కాలువేశాడు. -

వెంటనే బుస్సుమని కాటేసింది..."అమ్మో! పాము చచ్చా!" అంటూ నేలకొరిగాడు పాపం.

ఎన్ని కేకలువేసినా వినిపించుకోని ఆమె, యీ కేకకి వెనక్కితిరిగి చూచింది - అతన్ని.

'అయ్యో! పాపం చచ్చిపోయాడే - నిర్భాగ్యుడు. నాకోసం, యితను ప్రాణం బలియిచ్చాడే. ఆహా! నన్ను యింతగా యెందుకు ప్రేమించాడు?' అని యిలా కొంచెంసేపు విచారించింది......వెనక్కివేసిన అడుగును జోరుగా ముందుకు వేసి, వెనకకు చూడకుండానే వెళ్ళిపోయింది - యెంకి.

"ఇష్టంలేని నిన్ను, అవినీతికార్య మాచరించుమని బోధిం చిన మానవుడు మరణిస్తే - నీ కేం?" అని, ఆమె మనస్సులో యెవరో చెప్పినట్టుండి, ఆమె మరెంత జోరుగా నడుస్తోంది.

*  *  *

సత్రం అరుగుమీద పండుకున్న మొంకికి యెంత ప్రయ త్నించినా - నిద్రపట్టడంలా! మనస్సు అగాధజలంలో మునిగి ఉక్కిరిబిక్కిరైంది - మతి స్వాధీనం తప్పి, కాలుగాలిన పిల్లిలా, అటూయిటూ తిరిగింది.

అంతులేని ఆలోచన లామె బుర్రలో శరవేగంగా పరు గెత్తు తున్నై.

దారిలో జరిగిన దృశ్యం - మొంకికి కన్నుమూస్తే ప్రత్య క్షమయ్యేది—భయంవేసేది.

గుండె "దడదడా" కొట్టుకుంటుంటే వర్షము జోరుగ కురుస్తూంది.

ఆమెస్థితికి ఆకాశంకూడా విచారం పొంది యేనుగు తొండంలాంటి కన్నీటిధారలు — కార్చింది.

మొంకికి యెటుచూచినా, అతనే ప్రత్యక్షం. దీన భావంతో—"మొంకీ - నీకోసం - నీప్రేమకోసం........యీ స్థితి కొచ్చిన నన్ను చూడనైనా, చూడకుండా వెళ్ళిపోయావే" అనే మాటలు ప్రతిధ్వనిస్తున్నయి.

"ఈ బూటకపు జగంతో నన్ను సరిపోల్చావే? త్యాగాన్ని చూపిద్దా మనుకున్నా నీకోసం......" అంటున్నట్టు తోచింది వెంకికి.

భోరున కురిసే వాన — హోరున వీచే గాలి
కలవరిస్తున్నాయి
"నీ కో స ం — నీ కో స ం!" అని.

వేములూరు వెంకటేశ్వర్లు

# శృంఖలాలు.

[ప్రకృతిదేవత ఒకచోట కూర్చొని ఏడుస్తూవుంటుంది.
శని అక్కడకు తడిసిపోయిన బట్టలతో వచ్చి]

శని:—[వణకుచు] ఏమి ప్రకృతీ! యిట్లా భోరున ఏడ్చుచుండగా ని న్నెప్పుడూ చూడలేదే?

ప్ర:—శనీ! కొంతకాలాన్నుండి యిట్లే యేడ్చుచున్నాను. నీవు నన్ను చూచియుండలే దనుకొంటాను. సరేకాని, నీ విట్లు వణకిపోతున్నావేం?—అయ్యో, నీబట్టలుకూడా తడసినట్లున్నవే?

శని:—అది తెలియదూ? ఆదేశము...ఇక్కడకు చాలా దూరం — అక్కడ్నుంచి నన్ను వెళ్ళగొట్టారు — నా కెక్కడా చోటులే దా దేశంలో — వారు నన్ను వెంటాడుతున్నారు. సముద్రంచుట్టూ తిరిగి, తిరిగి, ఈది, ఈది, ప్రాణంవేసారిపోయింది. ఈ అర్ధరాత్రి ఎట్లో ఈ అరణ్యప్రాంతం చేరాను. వాళ్ళు నన్ను నీలోనుండి తొలగించడానికి అనేక ప్రయత్నాలు చేస్తున్నారు.

ప్ర:—ఏదేశం అది, — ఎవరు వాళ్ళు? నీవు చెప్పే మాటలు నీవే అర్థంచేసుకోలేకుండా చెబుతున్నావ్ —

శని:—[బిగ్గరగా నవ్వి—భయంతో] మరచిపోయాను. ఆదేశస్థులు నా అడుగుల చప్పుడ్నిగాని, నా నవ్వునుగాని, కాదు కాదు నే పీల్చివదలిన గాలినిబట్టి కూడా గుర్తుపట్టే సామర్థ్యం గలవాళ్ళు. ఇటుచూడు — నా హృదయ మెంత మితిలేని

వేగంతో కొట్టుకొంటూందో ? నీవు లెక్కపెట్టగలవా? నాకు తెలుసు — నీవు పెట్టలేవు.

ప్ర:—ఏమి శనీ! నీవు వణకునది తడసిన బట్టల చలికా, లేక ఆ దేశస్థులు నిన్ను పెట్టిన బాధలకా? —

శని:—చలి — హుః — చలి — వెధవచలి ! ప్రకృతీ! నాశక్తి నీకు తెలియదూ? — ఆరోజు జ్ఞాపకం చేసుకో — బ్రహ్మ విష్ణు రుద్రాదులు అంత వేగంగా పరుగెత్తుతోంటే నీవు ఆశ్చర్యపడి నిశ్చేష్టురాలవై అట్టే చూస్తూ నిలబడిపోయావు- ఇప్పుడైనా జ్ఞాపకంవచ్చిందా ?...... యిక వాయుదేవుడా నన్ను నిరోధించేది? — వెఱ్ఱిమాట. నే నంటే అందరూ గజగజ లాడ్తారు. నే పిల్చి వదలినగాలిని చూచి గిజగిజ తన్నుక చస్తారు. యింతా తెలిసిన నీవే [గాబరాతో నెమ్మదిగా] మరచి పోయాను, మరచిపోయాను. అటు తిరిగిచూడు. వాళ్ళు వస్తు న్నారేమో ? - అబ్బా! నాగతి ! - నాగతి అయిపోయిం దిట్లా, అనుకోకుండా...

ప్ర:—ఓహో ! తెలిసింది. చూచాను, పరిశీలించాను. యిప్పుడు వాళ్ళు రావడం లేదు — వచ్చే ప్రయత్నంలో వున్నా రేమో?.........శనీ ! అందరు బిడ్డలూ నాకు సమానమే ! వాళ్ళు అట్లుండడం నాకు మహాయిష్టం — కాని శనీ! యీ చోటు చూడు — నా యీ బిడ్డకళ అమావాస్యకి తీసిపో కుండా వుంది — చూచి వద్దాం — వస్తావా?

శని:—సరే కొన్నాళ్ళు లా వస్తావా?

ప్ర:—భయంలేదు - నాతో రా - [ఇద్దరూ హిందూ దేవతదగ్గరికి వస్తారు. ఆమె నిద్రపోతూవుంటుంది] చూశావా శనీ! దీనిశరీరం కొన్నాళ్ళక్రింద ఎంత అందంగా వుండేది - నీ వెరుగవూ? అందరికంటే, అందంగా వుంటుందనీ మంచిగుణాం కలదనీ ప్రతివాళ్ళకూ దీనిమీద ఆశ. దీనివద్ద కపటం లేదు. అందుచేతనే నేను దీన్ని అందరికంటే బాగా ప్రేమిస్తాను. పాపం అలసి సొలసి ఎట్లు నిద్రపోతూందో చూడు.- ఒకప్పుడు హంస తూలికా తల్పాన ఈబిడ్డ వూగుతావుంటే దాని సోదరీ మణు లంతా దాసీలలాగున; "నేనూపుతానంటే, నేనూపుతాను" నని పోట్లాడుకొనేవారు. ఇప్పుడు ఇటు చూడు శనీ...ఈ శృంఖ లాలు వదిలించడానికి వీల్లేనంత గట్టిగా వున్నాయ్! (అని తట్టి) అమ్మాయీ!

శని:—అమ్మా! యిప్పుడు లేపొద్దు. నన్ను పోనీయ్, ఆమె దృష్టిపథాన్నుంచి (అని పోబోతాడు).

ప్ర:—చెయ్యి పట్టుకొని, రావోయ్ - పర్వాలేదు. నే నున్నాను. అమ్మాయ్ - అమ్మాయ్ - అమ్మాయ్!

హి:—[వళ్ళు విరుచుకుంటూ హిందూదేవత గాఢ నిద్ర మేల్కొని]అమ్మా! యివ్వాళ పలకరించి పోయేదానికి వచ్చావూ? ఎన్నాళ్లకి? అమ్మా! నిన్ను కౌగలించుకొందా మన్నా, ఈ పాడు సంకెళ్లు చూడూ, అడ్డు పడుతున్నాయ్! ఏం చెయ్యను?

ప్ర:—[కూతుర్ని కౌగలించుకొని కళ్ళవెంట నీరు కారుస్తూ] నా అమ్మగదూ! నీవు దుఃఖించవద్దు — ఎల్లకాలం యిల్లానే వుంటాయీ సంకెళ్ళు - పోవా? [శని వైపు తిరిగి] శనీ! చూచావ్రా నా ముద్దుపట్టి గోడు?

హి:—అమ్మా! ఈ దుర్మార్గుడ్ని వెంటబెట్టుకొచ్చా వెందుకూ? వీడుచేసిన ద్రోహానికి నేనే ననుకున్నావ్ గాబోలు! నీ ముద్దు మనుమళ్ళంతా ఎల్లా ఘోషిస్తున్నారో - నీవు చూడ లే దనుకుంటాను. నేను చూడలేక పోతున్నానుగదా! నీవు విన్నే వినలేవు. [శని పారిపోబోతాడు]

ప్ర:—శనీ! నానుండి తప్పించుకొను శక్తి నీ వింకా సంపా దించలేదు. [రెక్కలు పట్టుకొని] భయములేదు - వుండు. తర్వాత ఏమి జరిగిం దమ్మాయ్ ?

హి:—అమ్మా! ఒకమాట. అప్పుడు నే నెట్లా వుండే దాన్నే? నువ్వే చెప్పు?

ప్ర:—బిడ్డా! ఆరోజున మనమంతా భామారాణి ఇంటికి పేరంటాని కెళ్ళినప్పుడు - ఆమె నిన్ను చూచి బొట్టుపెట్టబోయి చేయిరాక నీముఖంలో ముఖంపెట్టి అదేపనిగా చూచి ఆశ్చర్య చకితురా లవడం నేను కనిపెట్టి నీకు దృష్టితాకినదని అదినేను తీసిపారవేసిన విషయం నేను మరచిపోయానా? వెఱ్ఱితల్లీ! చెప్పమ్మా - తర్వాత —

హి:—అమ్మా! వీడు రోజూ నాదగ్గరకొచ్చి, అక్కా! యివ్వాళ అట్లాచేశాను, యిప్పు డిట్లా చేశాను, అంటూ ఏమి టేమిటో చెప్పేవాడు. నేను మందలించేదాన్ని. నాతో బహు బాగా స్నేహంగా వుండేవాడు. ఎంతో ప్రేమ జూపేవాడు. వీడి మోసం నేను కనిపెట్టలేకపోయాను. తర్వాత వీడు కోరినట్లే నా స్నేహితురాలయిన మతాన్ని ఎట్లో ఒప్పించి వీడికి పెండ్లి చేశాను.

ప్ర:—మతాన్ని వీడి భార్యగా చేశావ్?

హి:—ఆ ! ఆ మతం వీడితో కాపురం చెయ్యడం బహుకష్టం గాబట్టి, నేనొక్కదాన్నే వుండలేనని చెప్పింది. సరేలే పాపం, వుండలేదనుకొని కులాలన్నిట్నీ పిలిచి మతానికి స్నేహంగా పంపాను. అప్పు డంతా అక్కచెల్లెండ్రగానే ఆడుకొం టుండే వారు.

ప్ర:—బాగానే వుంటుండేవా రన్నమాట - అప్పుడు. ఆఖరుకి—

హి:—ఏమయిందో చెబుతా విను. తర్వాత కొన్నాళ్లకు మతానికి మద మెక్కి- కులా లన్నిట్నీ దాసీలగా నియమించు కుంది, ఏ ఒకళ్ళనో యిద్దరినో స్నేహితురాండ్రగాభావించుతూ. ఇక్క డిది యిట్లుండగా, వీడు చాటుగాపోయి సంఘాన్ని పెండ్లా

డాడు. దానికి సగముచూపే. - అదైనా ఎట్లా? - రాత్రి కళ్ళు కనబడతయ్; పగలు కనబడవు. అయితే యిప్పుడు కొంచెం నయమేలే. సరే అది అట్లుంచు - తర్వాత తక్కిన కులాలన్నీ ఈ విషయం నాతో మొరపెట్టుకొన్నయ్. సరేలే, అని నేను వాళ్ళను సర్దిపంపి వీడికి కబురుచేశాను. అప్పుడు వీడు త్రాగి తందనాలాడుతున్నాడు. గట్టిగా వీపుమీద తట్టి, ఏరా అబ్బాయీ! దాన్ని నీవు కోరినట్లుగానే పెండ్లిచేశానుగదా — మళ్లీ చాటుగా ఈ ఏడు పెండుకురా? అన్నాను. ఆహా! నీవా నన్ను అడిగేదానివని చేతులోవున్న గుప్పెడు కారం నా రెండు కళ్ళల్లో కొట్టాడు.

ప్ర:—ఏరా, శనీ! — అక్కనేనా యిట్లా చేయడం? ఎంత తప్పురా — తప్పుగాదూ?

శని:—అప్పుడు తెలిసికోలేక పోయాను, అమ్మా!

హి:—వీడిగుణం తెలిసేగా - అక్కగా రబ్బాయిలు వెంటాడితే, అమ్మెక్కడని పరుగెత్తుకొని వచ్చాడు. వినమ్మా! తర్వాత ఆమంట భరించలేక రెండుకళ్లూ రెండుచేతుల్తో మూసుకో బోయాను. ఇంతలో ఎవరో వచ్చి చేతులకు ఈ సంకెళ్ళు తగిలించారు. అప్పుడు దూరంగా నిలుచుండి వీడు పకపకా నవ్వాడు; నేను చూడలేదు గాని విన్నా...

ప్ర:—ఇంతకీ ఈ సంకెళ్లకీ కారణం వీడేనన్నమాట....

హి:—మరి యింకెవరు?...అమ్మా! మతానికీ సంఘానికి సవతిపోరుగా వుంటుంది. వీడు తాగి తందనాలాడతా పెట్టిన చట్టాలన్నీ ఆచారాలుగా మారిపోయినయ్, సంఘంలో. సంఘాని కిప్పుడు కళ్ళుబాగుపడుతున్నై. కులాలన్నీ తమ్మోదాసీలగాచూచిన మతంమీద కక్ష తీర్చుకోవాలని సంఘం తరఫున చేరుతున్నై. వీడ్ని మాత్రం యిద్దరూ దగ్గరకు చేరనివ్వడంలేదు. ఇప్పుడు అదీకాక మతం నాదగ్గర కొచ్చి సంఘానికీ తనకూ రాజీ కుదర్చమని బ్రతిమిలాడుతోంది. అట్లా చేసేదానికే బహు ప్రయత్నాలు చేస్తున్నాను. ఆఖరుకి ఎట్లాగొట్లా రాజీచేస్తానులే. కాని వీడినిమాత్రం యిక దయదలచి నేను రానిచ్చినా, నాబిడ్డలు మాత్రం ఒప్పుకోరు.

ప్ర:—శనీ! ఎంత ద్రోహంచేశావురా ! ఎంతద్రోహం?

శని:—కుట్రతనంమీద తెలియక చేశాను. సంఘం నన్ను దగ్గరకన్నా చేరనివ్వడంలేదు. మతం ఏదో కంచంలో కూడేస్తుందేగాని మాట్లాడడంలేదు. నా కింకెక్కడా చోటు కనబడ్డంలా. చాటుచాటుగాబడి మనుష్యులు లేకుండేచోటుకు పోయి మణిగుంటాను. పోతాను. అక్కయ్యా! సెలవియ్యి. క్షమించు, పాతనేరానికి. పోయివస్తా నమ్మా!...

ప్ర:—ఏ! మళ్ళీ రావన్నూలే. (శని పోతాడు) అమ్మా! నీకు క్షేమం కలుగుతుంది. తెల్లవారిపోతూంది. నీబిడ్డలు మేల్కొంటారు. నీవు వాళ్లు మేల్కొనకమునుపే ఆకళ్ళనీళ్ళు అవి తుడిచికొని నవ్వుతూవుండు. నా అమ్మగదూ (పైట చెరగుతో కన్నీళ్ళు తుడిచి) వస్తా, నీ వుండమ్మా!...

హా:—మళ్లీ ఎప్పుడొస్తా వమ్మా!

ప్ర:—అమ్మా! ఈసారి త్వరలోనే నీ సంకెళ్ళు ప్రూడదీసే సన్నాహంతో వస్తా.....బిడ్డలు!........జాగ్రత్త (వెళ్ళిపోతుంది)

కవియాం సీతారామారావు చౌపం

